

దీనదయాళుడు

( శ్రీ హరనాథ ప్రభువు. )

# " మధుర లేఖలు - 2-వ భాగము "

ఈ గ్రంథ ముద్రణకై 'కుసుమ హారనాథ ప్రచార సంస్థకు' శ్రీ సోమారెడ్డి కోటారెడ్డిగారి కుమారుడు ఆది శేషారెడ్డి గారును, శ్రీ గండవరపు రామచంద్రారెడ్డిగారి భార్య ఆదెమ్మగారును, ధన సహాయముచేసి యీ గ్రంథమును ప్రభుని జన్మోత్సవ సమయమునకు ప్రచురించుటకు సహాయము చేసినందుకు మా కృతజ్ఞతా పూర్వక వందనములు.

కుసుమ హారనాథులు వీరికి సంపూర్ణ ఆయురారోగ్య భక్తి ప్రపత్తులను కలుగ జేసి, వీరికి ప్రభుని పాదములందు నిశ్చల భక్తిని ప్రసాదింప ప్రభుని వేడు చున్నాము.

విధేయులు,

కార్యనిర్వాహక వర్గము,

కుసుమ హారనాథ ప్రచార సంస్థ.

ఈ గ్రంథము 'ప్రచార సంస్థ' ద్వారా వెలువడుచున్న ప్రథమ గ్రంథము. ఈ గ్రంథము శ్రీమతి విమలామా ముద్రించిన ఆంగ్లలేఖలకు శ్రీ గురుజాడ సూర్యనారాయణమూర్తి M. Sc. గారి అనువాదము. వీరు ప్రభుని ప్రచారము చేయుటలో యీ సంస్థకు గావించిన సేవ ఘనమైనది. ప్రభువు వీరికి సర్వదా యిట్టి కార్య నిర్వహణకు శక్తిని ప్రసాదించుగాక!

ఈ గ్రంథము వలన వచ్చులాభమంతయు "ప్రచార నిధి" కి చేర్చబడును. అందుచే తమరు మాత్రమే యీ గ్రంథమును పొంది యూరకుండక యితరులు కూడ పొందునట్లు చేయుదురు గాక! యని ప్రార్థన.

ప్రచార సంస్థ.

# ప రి చ య ము

శ్రీ హరనాథ భగవానునిచే వేలాది లేఖలు ప్రపంచ మందలి మూలమూలలనున్న తనభక్త కోటికి వ్రాయబడెను.

ఈ లేఖలు మధురాతి మధురమై ఆధ్యాత్మిక ఆదర్శ జీవితమును నెరపుటకు, వీటిని పఠించువారు ఏ కులమువారైనను, ఏ ఆధ్యాత్మిక మార్గ సాధకులైనను, అనన్యముగనుపయుక్త మగును.

ఈ లేఖల యందు శ్రీ హరనాథ ప్రభువు ఏవ్యక్తికి యేమే భగవద్రూపమందు ప్రీతిగలదో, దాని ననుసరించియే వ్రాసెను. శ్రీ హరనాథుని అద్వితీయ విశిష్టత యేమన ఎవరినిగాని వారి సాధనా మార్గములనుండి మరల్చలేదు. అట్టివారికి యింకనూ వారి మార్గమును మరింత సుకరముచేసి వారు గమ్యస్థానమును చేరుటనుగాంచి అమితానంద పరవశుడగు చుండెను.

నేటి ఆధ్యాత్మిక చింతకులు, యీ మార్గము ఆమార్గము కన్న ఘన మైనదని, యీ నామమానామముకన్న ఘన శక్తి కలదని, యీ భగవానుడు ఆ భగవానుని అంశమని తర్క మీమాంసలతో, వారి మార్గమున వారు ముందుకు సాగలేక, రుజుమార్గమున బోవుచున్న అనేకులను తమమార్గములే శ్రేష్ఠమని యేవో కొన్ని కల్లిబొల్లి మాటలాడి తమమార్గము

నను యీాష్వ యత్నించు చుందురు. అట్టి యెడ శ్రీ హార నాధుడు తానే స్వయం భగవానుడై కూడ మానవకోటి పోవు తప్పుమార్గములనుండి సరియగు మార్గమును జూపుచు, ఆయా వ్యక్తులనుసరించు మార్గములు శ్రేష్ఠమైనవని బోధించుచు, వారు తమ మార్గములను వదల వలసిన పనిలేదని అనేక పర్యాయ ములు తనలేఖలందు హెచ్చరించెను.

ఆతని మధురలేఖలను పఠించిన, శ్రీహారనాథు డొకప్పుడు హరినామస్మరణ చేయమనియు, వేరొకప్పుడు రాధేకృష్ణయని పల్కుమనియు, మరొకప్పుడు ఏ భగవన్నామ మైనను శక్తి వంతమైనదేననియు వ్రాయుటను చూడగలరు. ఆయా వ్యక్తుల అభిరుచులను బట్టి వారి కాయామార్గములనే సుకరము చేయుచు వారు ఆదర్శ జీవితమును జీవింప వలయుననెడి ఆవే దనయే కుసుమహారనాధు లవతరించుటకుగల ముఖ్యకారణము.

శ్రీ హారనాథుడు క్రొత్తమతముగాని, క్రొత్త ఆధ్యా త్మిక మార్గమును గాని స్థాపించుటకు రాలేదు. ఆతడు యీ అనంత మానవకోటి యందుగల భిన్నరుచులను గ్రహించి, వారి వారి యిష్టాను సారముగనే వారికి తగినట్లు, ఆధ్యాత్మికా హారమును ప్రసాదించు చున్నాడు. ఈ కారణముచే శ్రీహార నాథుని హృదయము ఇంత వరకు వెలసిన అన్ని అవతారముల బాహ్యాంతరతత్త్వములను గ్రహింప గలిగినదై యుండవలెను. శ్రీ హారనాథుడు సాధకుడు కాడు. ఏ గ్రంథములను పఠించి యెరుగడు. గద్దెలనెక్కి గంభీరోపన్యాసముల నిచ్చి యెరుగడు.

అయినను ఆతడు యీ మానవ కోటిని విచిత్రముగ తన వైపున కాకర్షించుకొనుచున్నాడు. ఇన్ని అద్వితీయ శక్తులు గల వాడెవ్వడగునో తామే గ్రహింతురుగాక! ఆతడే భగవానుడని ప్రత్యేకముగ తెలుప నవసరములేదు.

శ్రీహారనాథుని దివ్యత్వమును ఆతని మధుర లేఖల యందు గ్రహింపగలరు. ఆతడనేక దేశీయులకు అనేక ప్రాంతముల వారికి లేఖలువ్రాసెను. ఆయన భక్తకోటిలో లేని జాతి లేదు. ఆతని భక్తకోటిలో జపించని నామము లేదు. అన్ని మతముల ఏకత్వమే శ్రీ హారనాథ మతము. అన్ని మధుర నామముల మాధుర్యమే 'కుసుమ హారనాథ' నామము.

శ్రీ హారనాథ ప్రభుని దివ్యనామమును ఎందరో స్మరించుచు, ఆనందించుచున్నారు. ఆతని దివ్యనామము మృతి చెందిన వారి ననేకులను పునర్జీవితులుగ జేసినది. అనేక దీర్ఘవ్యాధులతో పీడింపబడుచుండిన వారికే నామము అద్వితీయమగు పరమౌషధముగ పనిచేసినది. ఈ విధముగ కుసుమహారనాథుల నామము వలన దీర్ఘవ్యాధుల నుండియు, మృత్యువు నుండియు రక్షింప బడిన వారు నేటికిని సజీవులై యున్నారు. ఇంకనూ అనేకులు నేటికిని రక్షింప బడుచున్నారు.

శ్రీహారనాథుడు తన దివ్యలేఖలనుగూర్చి యిట్లు తెల్పెను:—

"మురళిచే గోపికలు తరించిరి, తన 'మహతి' వలన

నారదుడు అమృత స్థితి యందుండ గలిగెను. అట్లే నేడు మీ మోక్షము నాలేఖని యందున్నది."

"నాలేఖలను సదా మీ వెంట నుంచుకొనుడు. మీకు మనశ్శాంతి లేని సమయమునవాటిని పఠింపుడు. అందలి యేదో యొక లేఖ మీకు మనశ్శాంతిని తప్పక చేకూర్చ కలదు."

"నాలేఖలొక పెద్ద గని వంటిది. మీరు పఠింపగా పఠింపగా అందుండి అనేకములగు మహత్తరమైన నూతన రత్నములు (ప్రేమభావములు — భక్తిసూత్రములు) వెలువడు చుండును."

"నేను నాలేఖలలోనే యెక్కువ ప్రసన్నుడ నై యున్నాను. నేను యీలేఖల యందే లీనమై, అందే నృత్యము చేయు చున్నాను."

ఒక భక్తుడు ప్రభువును తాను యే 'నామము' స్మరింప వలయునని ప్రశ్నింపగా అతని కిట్లు వ్రాసెను:—

"నీ హృదయమేనామము యందు అభిరుచిని పొందిన దానినే స్మరింపుము. అన్ని నామములును శక్తి వంతములై నవే."

శ్రీ హరనాథ భగవానుడు తన నామమును గూర్చి గూడ యిట్లు పల్కెను.

"హరనాథ యనునామము అఖండ శక్తి కలదని మీరు తప్పక గ్రహింప గల్గుదురు గాక!"

పై వాక్యము లన్నింటిని బట్టి, యే ఆధ్యాత్మిక మార్గమున ప్రయాణము చేయువారైనను, శ్రీ హరనాధుడవతార పురుషుడనియు- ఆతని 'మధుర లేఖలు' తమ మార్గమును సుకరము చేయుననియు గ్రహింపగల్గుదురు. ఈ లేఖలను పఠించుటచే ఆతని దివ్యత్వముతో బాటు ఆతని నామముకూడ మహాత్తరమగు శక్తివంతమైనదని గ్రహింపగల్గుదురు.

హైద్రాబాదు
30—6—56.

రాళ్లబండి సత్యాలు-



ప్రభువార నాధుని

# మధుర లేఖలు

## రెండవ భాగము

## లేఖ 1.

ఆనంద మయ,

నీ లేఖ చదువుటకు నేనెంతయో సంతోషించితిని. నీ మనోస్థితిని బట్టి చూడగ, 'ముక్తియార్' ఉద్యోగము నీకు తగియున్నట్లుగా తోచదు. నీవు సూచించిన 'డి. టి. ఎస్.' ఆఫీసులోని యుద్యోగము కొరకు యత్నము చేయుటమంచిది. అది నీకు మంచిచేయవచ్చును. నీ మనస్సునకు తగినట్లుగా ప్రపంచమును కృష్ణుడు మార్చుగాక! నీవు కోరినట్లుగా ప్రపంచము మారినదని తెలిసినంతనే నా ఆనందమునకు మేరయుండదు. కృష్ణుడట్లు చేయుగాక! కృపామయునకు నేను చేయు ప్రార్థన అదియే. ఏది జరిగినను నిర్విచారముగనుండుము. నీవు కృష్ణుని పిలచితివి. అందుచేత నీవు 'సదానందము'లోనుండి, యితరులను కూడ అటులనే యుంచగలవు. 'డి. టి. ఎస్.' ఆఫీసులో ప్రవేశింపుము. అందరిని కలుసు కొనగలవు. వైశాఖమాసములో యింటికి వెళ్ల దలంచితిని. అపుడు అటల్ (అటల్ బిహారినంది) మరియు పెక్కు యితరులు కలుసుకొందురు. అనుకూలమున్న, నీవు కూడ మాలోనుందువు. అందుచేత ఆతురత పడవలదు.

యుగళమూర్తి యొక్క మంత్రము నారాధించు నీవు ధన్యుడవు. నీ జన్మసార్థక మయ్యెను. మంత్రము కూడ నామమే. కాని ప్రభుని సూచించు గుర్తేనామము. అది అతనికీ, మనకు మాత్రమే తెలియును. ఇతరులకు తెలియజేసినచో అందలి మాధుర్యము నశించును. అందుచేతనే మంత్రము నామముకన్న భిన్నము గాక పోయిననూ, రహస్యముగ రక్షింపబడ వలసి యున్నది. అందుచేత నామమంత్రము లొక్కటేయని గ్రహించి, హృదయ ప్రేరణ ననుసరించి దేనినైనను స్మరించుము. అందు తప్పక శాంతి చేకూరును. శ్యామ సుందరుని రూపము నామో చ్ఛారణ చేయునపుడు దర్శనమగుట ఎంతయో మంచిది. ఒకవేళ యటుల కనుపించక పోయినను భయములేదు. నామము స్మరించిన కొలది, మనోహరమైన ఆతని రూపము గోచరమగును. సుందరమైననూ, వికారమైననూ యీ ప్రపంచములోని ప్రతి వస్తువూ, ఆతని యొక్క విభూతి రూపమే. ఆతడు సర్వ సుంద రుడు. సర్వసౌందర్యము ఆతనిపై ఆధారపడియున్నది. ఆతని సౌందర్యమే యీ ప్రపంచమును సుందరముగచేసినది. అందుచే ఆతని సౌందర్యమును చూచుటకు నీవు ఎక్కువ శ్రమ పడ నవసరములేదు. భూతలమును పరీక్షించుటచే భూగర్భమునందలి వజ్రములను, విలువైన లోహములను గుర్తించగలిగిన మాన వులకు, మనకందరుకున్నట్టి నేత్రములేయున్నవి. కాని మనము వజ్రములను విలువైన లోహములను గుర్తించ లేకున్నాము! కొంచెము తరిఫీదు చేయుట వలన మననేత్రములు గూడ వారి నేత్రములవలె గుర్తించ గలుగును. అందుచే నామము జపించు

చుండుమని చెప్పుచున్నాను. అటుల చేయుచున్నచో యీ నేత్రములు కూడ సామాన్యవస్తువులలోని ప్రభుని సౌందర్యమును చూడగలుగును. అపుడు ప్రభునియొక్క స్వరూపమును ధ్యానించు నవసరముండదు. అపుడు నీస్థితి యీవిధముగ నుండును.

"ఏదిక్కునకు నీ నేత్రములు చూచినను శ్రీ కృష్ణుని స్వరూపమే గాననగును." ప్రభుని సౌందర్యము కప్పబడి యుండ లేదు. మరియు ఏదియుకూడ దానిని కప్పియుంచజాలదు. కాని మన నేత్రములు ఆ సౌందర్యమును జూచు శక్తి కలిగి యుండక పోవుటచే ప్రతిస్థలమందును అదిగోచరించుటలేదు. నామము జపింపుము. నీకోర్కెలు సఫలమగును. నామోచ్ఛారణ చేయు నపుడు నీమనస్సు దానియందు స్థిరముగా లేదని ఎందులకు వృథాగా చింతించెదవు? ఎటుల మనస్సు దారి తప్పును? "ఆతని" దరికి తప్ప జగత్తులో మనస్సు పోగలిగిన వస్తువేదైన యున్నదా? నీమనస్సు ఎక్కడకు పోయినను, ఏ సౌందర్యమును జూచినను, అవన్నియు నొక్కరికే చెందును, వేరు కాదు. అందుచే మనస్సు చలించు చున్నదని విచారించి కలతజెందవద్దు. పైగా, జగత్తులోని సర్వవస్తువులూ ప్రభునియొక్క వివిధ లీలలని గుర్తించుము. అపుడు నీమనస్సెక్కడకు చలించును? ఏ ప్రదేశమందు నీమనస్సున్నను, ఏదిక్కునకు పోయిననూ, తప్పక ప్రాణమునకు ప్రాణమైన శ్రీ కృష్ణుని పొందగలవు. అపుడు నీమనస్సును యింకనూ విశాలము చేయ నుద్యుక్తుడ నయ్యెదవు. నీ అల్ప హృదయములోననే ప్రభుని అసమాన సౌందర్యమును బట్టియుంచుటకు ప్రయత్నము చేయుము. అందుచేత

నిశ్చింతగా ప్రభుని నామమును స్మరింపుమని కోరు చున్నాను. సర్వమూ నీదరికి చేరినదై యుండి పోవును. కోరవలసిన దేమియు యుండదు. నీ అంతట నీవే అనవరతము సంపూర్ణ ఆనందములో మునిగి యుందువు. నీ మనస్సును నిర్బంధించుటకు యత్నము చేయవద్దు. అంతకన్న ప్రభుని సౌందర్యమును నీ ధ్యానలక్ష్యముగా జేసుకొనుము. నీకోర్కెలు సఫలమగును. నీ వ్రేలిచూపుతో అనేక మానవులను రాజాధిరాజులుగ చేయగల్గుదువు. ఇక మీదట యితరుల యింటివద్ద భిక్షార్థము పోవలసిన అవసరము లేదు. నామములో నిన్ను నీవు లయము జేసుకొనుము. నీ కోర్కెలు సఫలమగును. దానినెన్నడును మరువవద్దు. పిచ్చి వాని తలలో ప్రతిక్షణము అనేక ఆలోచనలుద్భవించి మరు క్షణమే అంతు తెలియుని అఘాతములో పడి నశించును. ఈ ఆలోచన లన్నింటిని వాక్కుచేతను, లిఖితముగను వ్యక్తము చేయ గల్గిన శక్తిని నే నెరుగను. ప్రభువు మనకట్టి రోజునిచ్చి నచో సర్వమును నీకు తెలియ జేతును. సమస్తమును నీయంతట నీవే గ్రహించగల్గుదువు. ఏకాంతమును ప్రేమించుము. ఏకాంత ప్రదేశములలో ప్రభుని నిజరూపము గుర్తించగలవు. నేత్రముల నుండి భాష్పములు రాలును. ఒడలు పులకించి కంపించ నారం భించును. ఇదియంతయు, గౌరాంగుడు అనవరత నామసంకీర్తన చే పొందగల్గిన యానందములోని ఒక్క అణువు మాత్రమేనని తెలుసు కొనుము. ఏకాంత స్థలమున సహజముగ కన్నులు భాష్పములను రాల్చును. రాత్రివచ్చు మేఘములు మానవ నేత్రములచే చూడబడక పోవుటచే ఎక్కువ వర్షము నిచ్చునన్న

సూక్తి కలదు. అటులనే ప్రభుని కొరకు ఏడ్వవలెనన్న ఏకాంత స్థలమునకు పోవలెను. నీవు ఒంటరిగ పోయి అతనికొరకు సంపూర్ణ హృదయముతో దుఃఖింపుము. 'నరోత్తమ ప్రార్థన' లోని పద్యములన్నిటిని కంఠస్థము జేసి ఏకాంతమున వాటిని మననము చేయుము. అందు గొప్ప సంతోషానందములను పొంద గలవు. అనేక మాటలు నామనసులోనికి వచ్చుచున్నవి. కాని నేను నిశ్శబ్దముగ నుండెదను.

ఇక్కడ నేను కొద్ది జీతముపై పనియుచేయుచున్నాను. కృష్ణుని కృపచే నారోజులు ఆనందముతో గడచు చున్నవి. నాలో నేనే సంభాషించుచూ ఆనందముతో నుండెదను. నేను భగవానుని చట్టముతో బంధింప బడితిని. అందుచేత సంతోష ముతో యిక్కడ పనిచేయుచున్నాను. మీరు ఆనందముతోనున్న నేను కూడ ఆనందముతో నుండెదను. ఈ ప్రదేశము యొక్క వాతావరణము చాల అనుకూలముగ నున్నది. ఇక్కడ కొందరు బెంగాలిదేశీయులున్నారు. కొందరికే తప్ప మిగిలిన వారందరికిని స్వల్ప జీతములే దొరకును. నేను అందరికన్న తక్కువ జీతమును పొందుచున్నాను. కాని మిగిలిన వారందరి కన్న సంతోషము తోనున్నాను

నీ ఆశ్రితుడు,
హార.



# లేఖ 2.

తండ్రీ ! హరీన్ (హరీంద్రబాబుకు).

నీ లేఖ చదువుటచేత వర్ణనాతీతమైన ఆనందమును పొందితిని. మీరందరును సంతోషముగ నున్న నేనును సంతోషముగనుందును. నేను సంపూర్ణముగ మీ రక్షణలోనున్నాను. ఆరంభమునుండియే న్యాయవాదిగ నుండుటను అసహ్యించుకొనవద్దు. ధనికులయొక్క పీడా ఫలితముగా అనేక మంది అసహాయులు దరిద్రులు న్యాయస్థానమునకు తీసుకొని రాబడుదురన్న సంగతి మరచిపోవద్దు. అట్టివారి కొరకైనను నీవు మేలుచేయ గల్గినచో నీ జీవితము వృథాకాదు. మరియు ఐహికాముష్మికములలో అత్యానందమును పొందగల్గుదువు. తప్పుడు సాక్ష్యమిచ్చుటవలన మహాపాపమెట్లు గల్గునో అటులనే సత్యమైన సాక్ష్యమిచ్చుటవలన అత్యుత్తమమైన గుణములను పొందుదురనునది కూడ సత్యము. న్యాయవాది వృత్తిని కూడ యిదే దృష్టితో తీసుకొనుము. ఆ వృత్తిలో ఉన్నంత కాలము అనేక మంది అసహాయులకు విశ్రాంతిని చేకూర్చ గలవు. దీనిఫలితముగ నీవు ఐహికాముష్మికములలో లాభమును పొందగలవు. కష్టములో నున్న వారిని హింసించవద్దు. ప్రభుని నామము స్మరించుచు, దరిద్రులకు, కష్టములకు లోనైన వారికిని సహాయము చేయుటయే నీ ఆదర్శముగా ఉంచుకొని కార్యరంగమున ప్రవేశించుము. ప్రభువు నిన్ను తప్పక అనుగ్రహించును. సందేహారహితుడవై కార్యరంగమున ప్రవేశింపుము. నీవు ఉత్తీర్ణుడ

వయ్యెదవు. బాధపడుచున్న ఒక్కవ్యక్తికి నీవు నిజముగ సహాయము చేయగల్గినచో నీ జీవితము ధన్యముగా పరిగణింపుము. మార్గము దుర్గమ మయినకొలది లాభమెక్కువ. కృష్ణచరణముల యందు నీ మనస్సును లగ్నముచేసి, మరియు జీవన్మరణములలో కూడ నామమే నీసర్వస్వమని తెలుసుకొని నీ ధర్మమార్గమున ప్రయోగ మించుము. కృష్ణుడు తప్పక అనుగ్రహించును.

నీ,
హార.

## లేఖ ౬.

ప్రియమైన రసిక్

వ్యాకులత చెందిన ఆత్మలెక్కడ శాంతి పొందగలవో తెలియజేయగలవా ? సజ్జను లేస్థలమునందు ఆనందమును పొందగలరో నాకు తెలుపగలవా ? పాపాత్ముడు నరకముయొక్క భీతిని తప్పించుకొని దానినెక్కడ మరచి యుండగలడో చెప్పగలవా ? ఏ స్థలమునందు సంసారమునకు బంధింపబడిన వాడు, బంధింపబడని వాడు సమానముగ గౌరవింప బడుదురు ? నీకు తెలియునా ? నీకు తప్పక తెలిసియే యుండవలెను. అట్టిస్థలము నీకు తెలియకుండునా ? నీకు తెలిసియే యుండవలెను. అది 'రసిక' ని దగ్గరేయున్నది. అందువలననే నీ సన్నిధినుండుటకు నే నెంతయో కోరుచుందును. నీముందర సంసారముచే బంధింపబడిన వారు, బంధింప బడని వారు సమానులు. ఎందువలన

ననగా నీవద్ద నున్నపుడు వారు ప్రపంచమును మరతురు! సంసార ముచే బంధింపబడినవారి కీ మరపు శాశ్వతమైనది. కాని సంసార బంధితుల కీమరుపు తాత్కాలికమైనది. ఇందులకు 'రసికు'డు నింద్యుడు కాడు. ఏలనన యీతారతమ్యము స్వభావ జనిత మైనది. వజ్రము సర్వులకు సమానమే. కాని అదే వజ్రము కొందరి కానందము కలుగజేయును. కాని దానిని తిన్నవానికి అదివిషముగ వ్యవహరించును. అందువలన 'రసికు'డు మాన వులయొక్క ప్రకృతి బేధము వలన వజ్రముగా కాని విషముగా గాని గోచరించుచుండును. ఈ బేధముపయోగించు వానిలో నున్నదిగాని వస్తువులోలేదు. నీ యందలి నాప్రేమ, నీతో నా సహవాసము స్వార్థ రహితములని చెప్పగలవా? " సుందరుని సన్నిధిని నేనుకూడ సౌందర్యవతిగా మారుదును, " దీనినే నేను కోరుచుందును. బహుశా "రసికు"ని యొక్క సాంగత్యములో నేను కూడా 'రసికు'నిగా మారుదునేమో. నా నిత్యానందుడే రసికాగ్రేసరుడు. అందు వలననే మానవుడు అనవరత ఆనంద మును కోరుచున్నాడు. అందువలననే పాపాత్ముడు అంతులేని సంతోషమును కోరుచున్నాడు. అందువలననే పీడితులు నిరం తర సౌఖ్యము కోరుచుందురు. బ్రహ్మనుండి పిపీలికాంతము వరకు పరీక్షచేయుము. ఈ విశ్వములో సజీవమైనదిగాని, నిర్జీవ మైనదిగాని, స్థావరమైనదిగాని, జంగమ మైనదిగాని ప్రతియొక్కటి నిత్యానందుని కోరుచున్నది. అందుచేతనే గౌరాంగుడు కూడ నిత్యానందుని ప్రేమలో ఉన్మత్తుడయ్యెను. నిదుర పోవుచున్నను మెలకువగ నున్నను ఆతని ఆలోచనల లక్ష్యము నిత్యానందుడే!

అందువలననే ఒక భక్తుడు " నిత్యానందుడు లేని చోటుకు నేను పోను " అనెను. ఓ సోదరా! నీవే ఆ నితాయివి. ఎందువల ననగా నీవు 'రసికు'డవు. నీవు జననము నుండియు 'రసికు'డవు. యావజ్జీవితము రసికుడవు. మరణానంతరము కూడ నీవు అటులనే ఉండెదవు. అందువలననే నీపై వ్రాలుటకు నేను ఎగిరి పోవు చుందును. కాని నీపై వ్రాలి నంతలో లాభమేమున్నది! అందు లోని ఆనందమును పొందుటకు నేను తేనెటీగను కాను. నేను ఒక చెద పురుగును. తేనె త్రాగుచు నాశనము చేయుటలో నాకు ఆనందమున్నది. ఇది నిజముగ చాల దోషము. ఎందు వల ననగా పాపాత్ముడు తనకు తానే చెడు చేసుకొనును. కాని రసికునకు కీడు చేయ యత్నించినచో తాను కష్టపడుటయే గాక యితరులకు కూడ దుఃఖము కలుగజేయును. అట్టిస్థితిలో వారి మార్గమునకు ఒక అడ్డుగ వ్యవహరించును. నాయందు గల నాశనము చేయు గుణములను తొలగించుటకై నీస్నేహ మును నీ సాంగత్యమును, నీ లేఖను నేను కోరుచున్నాను. నేను వ్యక్తము చేసిన వాక్యముల వలన నాప్రేమ స్వార్థరహితము కాదని నీవు తెలుసుకొనవలెను. ఈ విషయము యింక నొక్క చెప్పనవసరము లేదు. ఈ మధ్య ఆటలో నీయంతట నీవే కొంత పాలు వహించితివని తెలుసుకొని నూతన ప్రపంచమునకు నేను పోయినట్లు అనుకొనుచున్నాను. నీవు జాగ్రత్తగ ఉండవలెను. ఏలనన యీ ఆటలో కృష్ణుడు కూడ చాల ప్రముఖుడు.

" అతడు తనయొక్క మురళీ నాదముచే మానవులను యింటినుండి బయటకు పిలచి తిరిగి వెనుకకు పొమ్మని చెప్పును."

నీకిది అర్థమయినదని భావింతును. నేను కొద్దిగనే సూచించు చున్నాను. దానిని గూర్చి ఆలోచింపుము. ఆట ఆడి ప్రేక్షకులవద్దనుండి పైకము వసూలుచేయుము. అది లాభమైనట్టి మార్గము. కోరిన కొలది వచ్చుచుండును. అనవరత నూతనత్వమే దానికి కారణము. ప్రతిక్షణము ఏదో క్రొత్తగ, గంభీరముగ ఆశ్చర్యముగ వస్తువులను తెలియజేయును. నిన్ను నీవు రక్షించుకొనగలినచో అందు నష్టపోవలసిన దేమియులేదు. గట్టు మీదనుండియే చేపను పట్టుకొనుటకు యత్నించుచున్నావు. తీయని మాటలచేత నీ భార్యను నీళ్ళలో జొరబడునట్లు ప్రోత్సహింపుము. నీవు గట్టుమీదనే నిరీక్షించుచు తమాషాను చూచుచు ఆనందింపవలెను. కాని నీవుమాత్రము చేప జారి పోకుండ జాగ్రత్తగ పరీక్షించుచుండుము. ఆమె కృపతో నీటిని కదలించినంతమాత్రముననే చేప గట్టుమీదకు దుముకును. ఆ ఆశ్చర్యమును నీవు తిలకించెదవు. కాని జాగ్రత్త! నీటిలో ప్రవేశించుటకు ముందు ఆధ్యాత్మికసంపత్తి చాల అవసరము. అనగా ఆమె తన స్వరూపమును నీలో లీనముచేయునట్లు ఒప్పించుము, లేదా నీవే ఆమెలో లీనము కమ్ము. ఆమెను నీలో లయముచేసుకొనుట దుర్లభము. ఏలనన మహాసముద్రమును చిన్న చెరువులో యిముడ్చలేము. మిక్కిలి కష్టతరమైన యత్నమువల్ల కాని అది సాధ్యముకాదు. కేవలము అగస్త్యుని వంటి పురుషులకే అది తగియున్నది. నిన్ను ఆమెలో లీనము చేయుటకూడా అంత సాధ్యమైన పనికాదు. కాని సుళువైన ఉదాహరణలు అనుసరించగలవు. అట్టివారిలో బిల్వమంగళుడు,

చాందీదాసు, విద్యాపతి, జయదేవుడు, తులసీదాసు మొదలైన వారు. అందుచేత నిన్ను ఆమెలో లీనము చేసుకొనమని చెప్పు చున్నాను. ఆమె ప్రపంచమున ప్రవేశించుటకు ముందు యిది తప్పక పొందవలెను. లేకున్న నీవు త్యజింపబడుదువు. జాగ్రత్త! సర్పములను మోహాపరచుటకుముందు సర్పవైద్యుని వద్దనుండి ఆత్మరక్షణ విధానమును నేర్చుకొనుము. తదుపరి సర్పములను పట్టుకొనుట, వాటిని ఆడించుటను గూర్చి సర్పమోహాకారుల వద్దనుండి పాఠములు నేర్చుకొనవచ్చును. ఇందు ప్రావీణ్యత సంపాదించిన పిమ్మట నిర్భయముగ ఆనందముతో సర్పములతో ఆడుకొనగల్గుదువు. ఈ వాక్యములు "నిత్యకవిరాజు" తండ్రికి చదివి వినిపింపుము. 'పితి' బాబు ఉద్దేశ్యములుకూడ తెలుసు కొనుము. నిత్యధార్ తదితరుల మాటలనుకూడ వినుము. నీ ఉద్దేశ్యములతో యేకీభవించినచో వాటిని అంగీకరింపుము. లేనిచో వద్దు. నీ భావములను గౌరవించి యీ క్రింది పద్య భావమును తెలియజేయుచున్నాను.

"ఓ మనసా! నీవు సన్యాసివి కాదలచితివా? అటులైన చో క్షుద్రము, నీచము, మృత్ అయిన నన్నింటిని త్యజింపుము. రజతమువలె పవిత్రముగనుండుము. అరిషడ్వర్గములను దహింప జేయుము. ఆ బూడిదను శరీరమున పూసుకొనుము. క్షేత్ర మును తయారుచేయుము. అప్పుడు నూతన భావము లుద యించు మంత్రము తెలిసికొనగల్గుదువు. నీలో ప్రేమ జ్వలించి నపుడు 'నాథుడు' దర్శనమిచ్చును. ఓ మనసా! క్షుద్ర కామమునుండి విముక్తినిపొంది 'పవిత్రకామము' యొక్క

కోటలో ప్రవేశింపుము. కామమును "కామము" తో నశింప జేసి కామమును ఆరాధింపుము. సర్పములతో ఆడు కొనుము. కాని కామ సర్పముయొక్క కాటుకు జాగ్రత్త!"

ఇంక వెనుకకు పోనిమ్ము.

సదా నీ,

హారుడు.

## లేఖ 4.

ప్రియమైన తండ్రీ, శ్యామా!

(శ్రీయుత శ్యామ చరణ చక్రవర్తి, చిన్సూరా)

తండ్రీ, నీవు కూడ యిపుడు విశ్రాంతి తీసుకొనుట మంచిది. ఎంతకాలము మానవులకు సేవ చేయగలుగుదువు? ఎవరియొక్క సేవార్థము వచ్చి యుంటిమో, వారి (భగవంతుని యొక్క) సేవచేయుట ఉత్తమము కదా! లేనిచో మనము లేమికి గురి అయ్యెదము. ఈ క్షణమునుండి తయారుచేయుట మొదలు పెట్టనిచో, బయలుదేరు వేళకు సర్వమును చక్కగా అమర్చియుండలేక పోవుదుము. అనేక వస్తువులను యిక్కడ వదలి వేయవలసి వచ్చును. అది మనకు చాలా పశ్చాత్తాప మును కలుగ జేయును. అందువల్ల యిప్పటి నుండియే కొన్ని వస్తువులను చక్కదిద్దుట అవసరము. అప్పుడే మూడు, నాలుగు నోటీసులు యివ్వబడినవి. ఈ హెచ్చరికను లెక్కచేయనిచో

వారంటు (Warrant) జారీ చేయబడును. అపుడు, ఆందోళనతో "ఆహా! ఎంత పొరబాటు!" అనవలసి వచ్చును. క్షుత్పీడనమును శాంతింపజేయుటకు మానవులను సేవించినచాలు. హృదయ ప్రేరణను తృప్తి పరచుటకై, మనస్సును హృదయేశుని సేవకై వినియోగించుట ఉత్తమమైన పని. పిచ్చివానిమాటలు లెక్కచేయకుము. నీకు ధర్మమని తోచిన దానిని నిర్వర్తించుటకై సంసిద్ధుడవు కావలెను. తండ్రీ, మానవుడు సంసారము కొరకు ఎంతకష్టపడినను, పొందశక్యము కాకుండగా, కోర్కెలు హెచ్చుచునే యుండును.

దాదాపు జీవితమంతయూ, కుటుంబమునకు వినియోగింపబడెను. ఇక మిగిలిన కొద్దిరోజులైనా నీ ఆత్మకొరకు వినియోగించిన, హానిగాని నష్టముగాని లేదు.

నీ

హరుడు.

## లేఖ 5.

ప్రియమైన సోదరీ!

(శ్రీయుత గోపాలచంద్రముఖోపాధ్యాయుని చెల్లెలు)

సోదరీ! నీ యింటి పనులు అయిన తరువాత, నాతండ్రి అవసరములు చూచిన తరువాత ఏమైనా విశ్రాంతి కాలము దొరకినచో తావళముతో తియ్యని "రాధా కృష్ణ" నామము

జపించుము. ఇదిగాక యింటిపనులలో నిమగ్నమైనపుడు కూడ ఆనామమును నోటితో ఉచ్చరించుము. ఇతరవ్యక్తుల యొక్క విషయములలో కలుగ జేసుకొనవద్దు. మరియు యితరులయొక్క గాథలను (చాడీలను) ఒకరినుండి ఒకరికి తీసుకొని పోవద్దు. ఈ రెండు నిబంధనలను నీవు జాగ్రత్తగ మనసులో నుంచుకొనుము. నీకర్తవ్యమును తప్పించి యీ ప్రపంచమున దేనివిషయములోను కలుగ జేసుకొనవద్దు. నీవదినలతో కూడ యే విషయములోను కలుగజేసుకొనవద్దు. ఎంతవరకు అవసరమో అంతవరకే మాట్లాడుము. అదైన తరువాత హృదయమునకు ప్రియమైన "కృష్ణ" నామము జపించుచు ఆ సుందర మూర్తిని ధ్యానించుము. దేవత వలె నిన్ను నీవు పవిత్రముగ ఉంచుకొనుము. బాహ్యాంతరము లందు పవిత్రముగ ఉండవలెను. శరీరము అపవిత్రముగ నున్నప్పటికిని మనస్సు పవిత్రముగ నుంచుకొనుటయే పవిత్రత యొక్క ఔన్నత్యమని తెలుసుకొనుము. నీ మనస్సు పవిత్రమార్గము నుండి తప్పకుండునట్లుగా యుంచుము. నీవు పనిలో నిమగ్నమైనపుడు తావళమును నీ కంఠమునందు ధరించుము. ఒకక్షణమైననూ దానిని విడువవద్దు. నిదురపోవునపుడు కూడ నామమును జపించుము. లేశమంతైననూ మనస్సును యితర మార్గములలోనికి పోనీయవద్దు. ప్రభుని నామము చేత సర్వమును పావనమగును. నా కొరకై విచారించవద్దు. ప్రస్తుతము అంత అనారోగ్యముగలేదు. కాని సంపూర్ణమైన ఆరోగ్యము కూడలేదు. కృష్ణుని కృపచేత సర్వమునూ శ్రేయోదాయకముగ మారును. నేను యింటికి వచ్చినపుడు నిన్ను సమస్త

తీర్థములకును తీసుకొని పోవుదును. ఎవరో ఒక్కరు సలహా యిచ్చుటచేత తీర్థములకు ప్రయాణము కావద్దు. నాయన వెళ్ళినచో ఆయనతో కూడ వెళ్లవచ్చును. అది తప్పించి నీ సోదరులతో నైనను తీర్థయాత్రలకు పోరాదు. ఈనాఆజ్ఞను శిరసావహించుము. నాఆరోగ్యము బాగుగనేయున్నది. నీవు ఆనందముగనుండి కృష్ణనామము జపించవలెననియే నాకోరిక. నాయనకు నావందనములు.

నీ,

హర.

## లేఖ 6.

ప్రియమైన శారదా,

(శ్రీయుత శారదా చరణడే, సిలచర)

నీ లేఖ జమ్మూలో అందిన నాడే ఆవూరు వదలితిని. నేను కాశ్మీరు చేరినంతనే యింకొక లేఖ అందుకొంటిని. త్రోవ లో చాల ఆలశ్యమగుటచే సకాలమున నీ మొదటి లేఖకు సమాధాన మియ్యజాలకపోతిని. నీవేమనుకొంటివో తెలియదు. అందు నా తప్పెంత మాత్రమును లేదని గుర్తించగలవు. కేవలము పరిస్థితులయొక్క ఫలితమే. నా భార్యా పుత్రుల కొరకై 16 లేక 17 రోజులు వేచియుండవలసివచ్చినది. ఇక్కడకు వచ్చిన వెంటనే నా కుమారుడు రోగ గ్రస్తుడయ్యెను. నివసించుట కుపయుక్తమగు యిల్లును పొందజాలక పోవుచున్నాను. ఇప్పుడు

మాత్రము నేనొక ఇల్లు తీసుకుంటిని. విశ్రాంతిగా నున్నాను, ఇకముందు సకాలములో సమాధాన మిచ్చుచుందును.

ప్రియా ! మానవులు ఒక నిర్జీవమైన పాషాణపు తునకకు గాని, కొంచెము నీటికిగాని తమ సర్వస్వము (ఆత్మను, మనస్సును) త్యాగముచేసి ప్రభుని పొందెదరు. ఆతడు వారి మనోవాంఛలను యీ విధముగ సఫలముచేయును. కాని అది పాషాణపు తునకయొక్క గాని, నీటియొక్క గాని గుణములను తెలియ జేయునా ? అందుచేత ప్రియతమా ! వంశీయ గురువును వదల వలదని తెలియజేయుచున్నాను. గురువు యొక్కగుణములను గురించి ఆలోచించు అవసరమేమున్నది? కృష్ణునకు సాందీపులుడు తగిన గురువా ? ప్రహ్లాదునకు చండామార్కు, గౌరాంగునకు 'పూరి' తగిన గురువులా ? అది తప్పని సరియైనది. లేనిచో వేద సూత్రములు, వాటి పవిత్రత ఉల్లంఘింప బడును. గురువు ఎట్టివాడైనను, మంత్రము ఆతని వద్దనుండియే ఉపదేశము పొందవలెనని చెప్పుచున్నాను. అట్లుచేయుటకు ఒప్పుకొననిచో గురుశ్రేష్టులైన నీ తల్లివద్దనుంచి మంత్రము పొందుము. కాని నీవంశీయ గురువు వద్దనుండి అట్లుచేయుటకై మొదట అనుమతి పొందవలయును. ఇది ఉత్తమ మార్గము. నీమనస్సులో యేమియును దాచ నవసరములేదు. కృష్ణనామము జపించ నారంభించుము. నామమును ప్రేమించుము. సత్ఫలితములు వెంటనే కలుగును. సిలచర నుండి 'ప్రజాశక్తి' పత్రికలో ఒక వింతైన కథ విని చాల ఆశ్చర్యము పొందితిని. మేక మాంసమును భక్షించుటలో 'తల్లికి' (జగన్మాతకు) కుతూహల మున్నదని

ఎన్నడును అను కొనవద్దు. అసత్యమునకు అదియొక శిక్ష అని భావించుము. "తల్లి" సర్వ కృపామయి. ఆమెయొక్క భక్తునికి యీవిధముగ కృపను చూపించినది. మేకను అర్పించి ఆమె నేవిధముగా ఎవ్వరైన తృప్తిపరచగలరా? విశ్వమంతయూ ఆమెకే చెంది యున్నది. ప్రభుని తృప్తి పరచ దలచినచో నిరంతరము ఆయన నామమును జపించి, పూర్ణమైన నమ్మికతో నీ ఆత్మను అతనికి అర్పణచేయుము. నీవు సర్వదా ఆనందము నందుండెదవు. ఎన్నడును ఒడుదుడుకులలో పడవు. చల్లని ఛాయలో కూర్చుని యున్న వాడెవ్వడూ ఎండ వేడి బాధ నొందడు. అందుచేత, ప్రియా, నామమును జపింపుము. నీవు సుఖించెదవు. ముక్తికి నామమే మూలాధారము. నామము మంత్రరాజము. నామముకన్న శక్తివంతమైన మంత్రము మరొకటి లేదు. ఆతని నామమును మరువకుము. కృష్ణనామము కన్న గొప్పదైన మంత్ర మింకొకటి లేదు. నేను నిన్నెప్పుడైనను కలసినచో నాహృదయమంతయూ తెలియజేతును. నన్ను గురించి విచారింపవద్దు. నా ఆరోగ్యము వెనుకటి కంటె బాగున్నది. సర్వులకును నా ప్రేమ నందజేయుము.

నీ,

హర.



# లేఖ 7.

తండ్రీ,

( శ్రీయుత అకించంద్రనంది, ప్లీడరు, కుమిల్లా )

నీ లేఖకై ప్రతిరోజూ నిరీక్షించు చుంటిని. తండ్రియొక్క ప్రేమపూరిత లేఖ చదువుటచేత నాకు అత్యంత ఆనందము కలుగుచున్నది. తండ్రీ, నీవు అడిగిన ప్రశ్నలకు నిజమైన సమాధానము యీ అజ్ఞాన జీవి ఎట్లు యివ్వగలడు ? కాని నా మనస్సులో ఒకవిషయము మాత్రము స్ఫుటముగా ఉన్నది. రాధాకృష్ణ యుగళనామముకన్న ఏ ఇతర నామము కూడ మనలను పరవశము చేయదు. తండ్రీ, యీ నామము వెన్న పటికబెల్లముల మిశ్రమము వంటిది. పటికబెల్లములో మాధుర్యమున్నప్పటికిని గట్టి తనమనే గుణము కూడ నున్నది. కాని వెన్న (రాధ) యొక్క సాంగత్యముచేత గట్టిదనము మాయమై అత్యంతస్వాదుకరమైయుండును. (నామముయొక్క స్వాదుత్వము రాధరూపముయొక్క కలియిక వల్లకలుగు చున్నది. అందుచేత నాగౌరు (గౌరాంగమహా ప్రభువు) కేవలము తీయని స్వభావము కలవాడు. అందుచేత నాగౌరు అవతార శ్రేష్ఠుడు. ఆమాధుర్యము వర్ణించుటకు ఎవ్వరికిని శక్యముకాదు. మాధుర్యమనునది రుచి చూచి అనుభవించవలెను. కాని మాటలచేత చెప్పవలసినదికాదు. అందుచేత అందరును దానిని గురించి మాట్లాడక నిశ్శబ్దముగా ఉందురు. నామముయొక్క మాధుర్యము దానికదేసాటి. దానికి పోల్చదగినది యింకొకటిలేదు.

దాసితో పోలిక గలది, అది యొక్కటే. రాధాకృష్ణయుగళనామ మెట్టిదో హరేకృష్ణ నామముకూడ అట్టిదే. కాని రెండవది (హరే కృష్ణనామము) శిక్షాబద్ధమైన విషయము. మొదటిది (రాధాకృష్ణ నామము) ప్రేమోన్మత్తమైన ప్రియుని పిలుపు. తండ్రీ, నామ స్మరణ తపోయజ్ఞాది నిష్టలచేత నిర్దేశింప బడలేదు. నామము వేదాతీతము. అందుచేత ఏవిధమైన నియమములు బంధింపలేవు. నామమును సదా జపించుట ఒక్కటేదాని మార్గము. నామము ఏవిధముగ జపించినను మ నో ర థ ము ల ను సఫలము చేయగలదు. మిఠాయి వర్తకులకు నామము యొక్క మా ధుర్యమును హెచ్చు చేయువిధానము తెలియును. ఆ అంగడి (కొట్టు) యందలి మిఠాయి వర్తకుడు ఆనందమయుడైన నా నిత్యానందుడే. అందువల్ల నా ప్రార్థన యిది. నీశరీర మనస్సులతో సంపూర్ణముగ నిత్యానందుని యొక్క చరణముల యందు శరణు జొచ్చి, నామము స్మరింపుము. నీకు ప్రేమ జనించును. నీకు ప్రేమ జనించినపుడు ప్రేమ మయుడైన కృష్ణుని అత్యంత తృప్తికరముగ పొందగలవు. ఇవన్నియు తెలిసి యుండియు కూడ, ఆనంద మయుడైన నిత్యానందుని చరణ ముల యందు శరణు నేను పొందుటలేదు. నాదురదృష్టమునకు నిజముగ మేరలేదు. నిత్యానందుడు సంతోషము యొక్క రూపము. తండ్రీ, నాదురదృష్టము ఎక్కువైనదే! ఏలనన అంతపవిత్రమైన జ్యోతి మధ్యయుండినప్పటికిని గుడ్లగూబవలె నాకళ్లను మూసియుంచి, ఆ దర్శనముచేత నామనస్సును, కళ్ళను తృప్తిచేయ లేకపోతిని. తండ్రీ, నిత్యానందుడు అత్యంత దయా

మయుడు. తప్పక నీయందు ప్రసాదోన్ముఖుడై యుండును. నీవు నవద్వీపము వెళ్ళినపుడు చిన్‌సూరాలో ఉన్న, నాతండ్రి శ్రీ నందలాల్‌పాల్ ముఖ్యమైన విషయములు తెలియజేయును. నీవు తిరిగి వచ్చునపుడు యీ వ్యాపారములో వస్తువులను నిల్వచేయు వాడు, కాల్నాలో ఉన్న శ్రీయుత ఆనందలాల్ గోస్వామిని కలుసుకొని, నీదాహముతీర అమృతమును త్రాగుము తండ్రీ ప్యారీ చరణుడు కూడ వెళ్లుచున్నాడు. తండ్రీ, మిమ్ములనందరినీ ఎప్పుడు చూడగలుగుదునో అని నాహృదయము పరితపించుచున్నది. మిమ్ములనందరిని చూచి, పావనమై ఆనందించు రోజు ఎంత దూరమున్నదో ఆ కృపామయునకే తెలియును. నింపుటకు అసంభవమైన నాపొట్టను నింపుకొనుటకు యిక్కడ యీ కారాగార తుల్యమైన జీవితమును జీవించుచున్నాను. లేకున్నచో యిక్కడ ఉండుటకు లేశమంతైననూ కుతూహలము లేదు. నాతల్లి, సోదరులు, చెల్లెళ్లకు నన్ను జ్ఞాపకముచేయుము. నాతల్లి సదా నన్ను తన జాలినేత్రములతో చూచుగాక! నా దుర్గుణముల చేత నాయందలి ప్రేమలో లుబ్ధురాలై యుండకుండుగాక! అటలు (అటల్ బిహారినంది) చే వ్రాయ బడిన మూడవభాగము నాచేత ప్రచురింప వలెనని కోరుచున్నాడు.

నీప్రియుడు,

హార.



# లేఖ 8.

నమస్కారించి,

(శ్రీయుత వైద్యనాథముఖోపాధ్యాయునకు — భవానీపూర్.)

అయ్యా! మీవద్దనుంచి మూడు లేఖలు అందినవి. వాటికి సమాధానము యివ్వనందులకు ప్రత్యేకముగా తప్పు చేసితినని ఒప్పుకొనుచున్నాను. కాని నేనేమి వ్రాయవలెనో తెలుసుకొన లేకున్నాను. నన్ను దయతో క్షమింప ప్రార్థించు చున్నాను. అయ్యా! తమయొక్క శరీరస్థితిని గూర్చి తెలుసు కొని యెంతయో విచారించుచున్నాను. నేచెప్పగలిగినదంతయూ ఇదియే:— ఉదారమైన ఆత్మగల వ్యక్తి పూరింటిలో వసించు చున్ననూ, మహారాజువలెనుండును. కాని తప్పుచేసినవాడు రాజమందిరముననున్ననూ భయముతో కంపించుచుండును. సుఖ దుఃఖములకు నివాసస్థానముతో పనిలేదు. వాటి సంబంధము కేవలము మనస్సుతోనే ఉన్నది. సనాతన గోస్వామి రోగ పీడితుడైనపుడు, రెండింతలు కృతార్థుడైనట్లు పరిగణించెను. 'భక్తమాల' యందలి, శరీరమునుండి దిగజారిన క్రిములను తిరిగి తన శరీరమునందలి కురుపులలో చేర్చిన కుష్టురోగియైన బ్రాహ్మణుని గాథ తెలిసియేయుండును. అట్టి జనులకు, నివాస స్థలము ముఖ్యము కాదనియూ, ఒకరాత్రి విశ్రాంతిగా నిద్రించుట కుపయుక్తమై, అలసటనుండి తేరుకొనుట కుపయోగించిన చాలునని తెలుసును. అందుచేత వారు ప్రభునిముందర దీనముగ

ప్రార్థించలేదు. ప్రభువు కాప్సులై తమ హస్త స్పర్శచేతనే తీవ్రమైన కుష్టురోగమునుకూడ మాన్పు సామర్థ్యము గలవారుకూడ ఆ రోగమునుండి తమకు తామే నివారణచేసికొను యత్నము చేయలేదు. కాల్నా దేశీయుడైన భగవాన్ దాస్ బావాజీ, ప్రత్యేకముగ ప్రభుని ప్రార్థించి, కుష్టురోగమును తనకొక అంబరముగ చేసుకొనిన విషయము చాల నవీనమైనదే కదా! అందుచేత అనవసరముగ నీమనస్సును ఆందోళన పరుచవద్దనియూ, సర్వమూత్యజించి కృష్ణనామము జపింపమని ప్రార్థించుచున్నాను. నామము జపించినకొలది నీవు పవిత్రుడవై, ప్రపంచమును పవిత్రముచేయ గల్గుదువు. అయ్యా, బంగారముతో నిర్మింపబడిననూ, ఈ శరీరమును నేడో రేపో త్యజింపవలసియున్నది. అటులైనచో అంత చింతించుట దేనికి? బహుశ జనులు నన్ను నిందించవచ్చును. కాని జాగ్రత్తగ పరిశీలించినచో నాయందలి జనులయొక్క నింద, నాకు ఎక్కువ మంచిచేయునని తెలియనగును. వారికది లేకున్నచో, నేను సంఘమువదలి ప్రభుని నామస్మరణకొరకై వ్యవధి పొందవలసివచ్చును. ఏది ఎటులైనను, ప్రభువిచ్చిన ప్రతి వస్తువును అతని ప్రసాదముగనే గ్రహించి, ప్రభుపదముల వద్ద శరణుపొందుము. నిస్సందేహముగ నీవు తృప్తిని పొందగలవు. ప్రభువు అత్యంతకృపామయుడన్న సత్యమును మరువవద్దు.

అయ్యా! వినినదంతయూ స్వంతనేత్రములతో చూచినచో జనులకు కనుపించదు. అది నా విషయములోకూడ నిజము. నీవు చూచినచో, నీవు వినినదానికి సరిగా వ్యతిరేకమును నాలో

చూచెదవు. నాలో సుగుణములులేవు. ఇతరులను మోసము చేయుచు నా దినములను గడుపుచున్నాను. మనుష్యులను మోసము చేయుటే నావృత్తి. అందు నేను చాల ప్రవీణుడను. నాకన్న పెద్దపాపాత్ముడుండడు. కృష్ణనామమునకు అంటిపెట్టు కొని యుండుము. నీ అన్ని కోర్కెలు సఫలమగును.

నీ ఆశ్రితుడు,
హర.

# లేఖ 9.

అత్యంత ప్రియమైనరాయీ

(ఠాకూర్ యొక్క కుమార్తె)

తల్లీ!

నీలేఖను చదివి చాల విచారించితిని. ఏమి తల్లీ! నీవు వ్రాసినది! ఎవరు కృష్ణనామమును జపింతురో వారు అందరికన్న ఉన్నతమైనవారు. నాతల్లి తండ్రులతో గొప్పదైన ఆనందములో నీ దినములను గడుపుదువు గాక! జగత్తునకు ఆభరణము వంటి దానివై జగద్గురువు వయ్యెదవుగాక! నీ తల్లి తండ్రులు నీకు ప్రసాదించిన ఘనమైన భక్తిని తల్లియందు కలిగియుండుము. ఆమెను ఒక ఉన్నతమైన గురువుగా పరిగణింపుము. ఒకటిగా మారిన రెండు హృదయములు ఒకదానితో ఒకటి సమానముగ కృష్ణప్రేమచే అభివృద్ధి పొందునుగాక! అట్లయి ప్రతివారి

ఆనందమునకును మూలమగుగాక! మీరిద్దరు ఒక్కటై కృష్ణ నామమును జపించుచు కృష్ణప్రేమలో ప్రార్థిగ మునుగుదురు గాక! అదియే నాకోరిక. తల్లీ! రాయీ! కృష్ణుడు అత్యంత కృపామయుడు. అందువలననే నీతల్లి తండ్రులు నిన్ను గర్భము నందు ధరించి పోషించు నవసరము లేకుండగనే వారికి నిన్ను ప్రసాదించెను. నిన్ను గర్భమునందు ధరించి, పోషించు భారమును మా పైనుంచి నీ తల్లి తండ్రులను ఎడ తెగని ఆనందములోనుంచెను. దీని నంతయు యశోదాదేవి కృష్ణుని పొందిన స్థితికి పోల్చవచ్చును. నీయొక్క గొప్ప సుగుణముల చేతనే అట్టి తల్లి తండ్రులను పొందగల్గితివి. వారి అసమాన్యమైన సుగుణములను అలవరచుకొన యత్నించవలెను. వారి సాధుసేవ, ప్రభు నామ స్మరణ, విశ్వప్రేమలను అలవరచుకొని ప్రతివారిని సంతోష పరచవలెను. ఎవ్వరి భావములను గాని గాయపరచవద్దు, ఒకరి సంతోషమును జూచి ఈర్ష్యపడవద్దు. మరియు ఒకరి దుఃఖములను ఎగతాళిచేయవద్దు. ప్రతివానిని కృష్ణునకు చెందిన వానినిగ పరిగణింపుము. మరియు ప్రతి ఒక్కరిని సమానమైన ప్రేమతో జాగ్రత్తగ చూచుచుండవలెను. మేము నీకు తగినతల్లి తండ్రులము కాము కనుక, మాచెడు శిక్షణ అనుసరించుటచేత నీ కోమల హృదయము కఠినముగ మారునను భయముచేత నిన్ను మా వద్దనుంచుటలేదు. మా కొరకై నీవు ఆందోళన పడవలదు. మేము సంతోషముగ నున్నాము. ఈవిధముగ పదే పదే మాతోడి సంబంధము ఉంచుకొను చుండుము. కోమలత్వమునకు ఆట పట్టయిన నీ

తల్లికి నాహృదయ పూర్వక ప్రేమను అర్పింపుము. నాకును నీతల్లికిని యేవిధమైన వ్యత్యాసముగాని యున్నదని అనుకొనవద్దు. ఆమెకు అత్యంత ప్రియురాలివిగ ఉండవలెను. మరియు లేశమంతయినను బాధకు నీవు కారణము కాకుండ నుండవలెను.

నీ తండ్రి,
హర.

# లేఖ 10.

తండ్రి, భాగవత్

లాలా బాబును గూర్చి ఒకక్షణము ఆలోచించినచో "ప్రభుపదశ్యామలాల్ గోస్వామి"ని గురించి నీవు చెప్పదలచుకున్న విషయములు అనవసరమై యుండెడివి. నీ వటుల చేసినచో మనకు విచక్షణా శక్తిలేదని గుర్తించెడి వాడవు. 'చారూ' సోదరుని మరణము నిజముగ బాధకరమైన విషయము. మూడు నెలల విశ్రాంతి యివ్వబడినప్పటికిని ఆతడు యేమియు చేయజాలక పోయెను. ఏడురోజుల కాలముననే పరీక్షితుడు శ్రీకృష్ణుని తెలిసికొన గలిగెను. ఈవిషయము స్ఫుటము చేయుటకు, సోదరుడైన ప్రియనాధునితోడి సమావేశమును సూచించితిని. సోదరుడైన ప్రియనాధుని యొక్క యీ మరణము అనపేక్షితము కాదు. అతని మరణమును గూర్చి విచారించుచున్నాను. ఖేల యొక్క అంత్యము సమీపించునపుడు మనము తొందర పడవలసి వచ్చునన్న సంగతి అతడు తెలియ

జేసెను. నీసోదరుడు ప్రియనాథుడు కృతార్థుడు. ఆతని ప్రాజ్ఞ, ఆరాధన కూడ కృతార్థత పొందినవి. తండ్రీ, ప్రతిమాట, ప్రతిఖేల అర్థము చేసుకొనుటకు సమర్థులముకాము. కాని కృష్ణుని కృప అనంతమనియు శ్రీమతి రాధ యొక్క ప్రేమ అనంత మనియు, తెలుసు కొనుటయే మన భాధ్యత. ఇక్కడకు వచ్చిన తరువాత యింకనూ స్థిమిత పడలేకపోతిని. కొద్ది రోజులలో సర్వమును నీకు తెలియజేతును.

నీ,

హార.

# లేఖ 11.

అత్యంత ప్రియమైన తండ్రీ!

(శ్రీయుత రామరఖాల్ ఘోష్, ఎంటల్లీ.)

నీ లేఖ యీనాడు చేరినది. తండ్రీ! సత్య విరుద్ధమైన వచనములనుగూర్చి ఎక్కువగ ఆలోచింపరాదని యిదివరలో వ్రాసియుంటిని. తిరిగి యిప్పుడుకూడ వ్రాయుచున్నాను. అది మనసును అపవిత్రముచేసి బాధకలిగించవచ్చును. తండ్రీ, అట్టి విషయములన్నింటినీ మరువవలసినదని కోరుచున్నాను. నాపై విసురబడిన దానిని, దేనిని గూర్చిగాని నీవు ఎక్కువగ బాధపడ వద్దు. నేనొక దుర్గుణములకు ఆస్థానమువంటివాడనని అనేక పర్యాయములు తెలిపితిని. అట్టియెడ నేను నిందింపబడినచో

యేల నొచ్చుకొనవలెను? సత్యమువలన ఎవ్వరునూ బాధపడరు. తండ్రీ, మనోశాంతిని పోగొట్టుకొనకుము. ఏలనన అది నీకు దుఃఖమునే కలిగించును. ఆనందమును కలిగించదు. తండ్రి మీలోని ప్రతి ఒక్కరూ, నిత్యానందుని వనములో అసమాన్య మైన మాణిక్యముల వంటివారు. మీరందరును ఆనందముతో గుమిగూడి, వనముయొక్క ఖ్యాతిని హెచ్చుచేయవలెను. కాలము సమీపించకముందే నా కత్యంత ప్రీతికరమైన యీ ఖేలను విచ్ఛిన్నము చేయవలదు. తండ్రీ, నిత్యానందుని అనుసరించు వారిలో స్వార్థపూరిత సంఘములున్నవా ? నిత్యానందుని యిచ్ఛయే నెరవేరును. అట్టి వాక్కులు నాచెవులకు సోకకుండు నట్లు చేయుము. నేనొక పిచ్చివాడను. నన్నెప్పుడును పిచ్చివాని వలెనుండ నిమ్ము. నా ఖేలను ఆరంభించినట్లు గానే, నిత్యా నందునితోనే ఖేలను ముగించి, నేను నిష్క్రమింతును. నాకువ్యతి రేకముగ ఏమిచెప్పబడినను, కించిత్తయునను గోణగకుండగా, నీవు ఓర్చవలెను. ఏలనన, నాఖేల, ఎవ్వరిని, ఎన్నడును బాధించలేదని నాకు తెలియును. అదిగాక, కొందరు దానిచే ఆనందించిరి. నిత్యానందుని కృపచే నేను విచారించవలసినంత కారణమెన్నడును లేదు. నా బాల్యమునుండి యింతవరకును, ప్రభునివద్ద భయపడ వలసి నట్టియు, గతచర్యల జ్ఞప్తిచేత కంపింపవలసి నట్టియూ, పనిని దేనినిగాని చేయలేదు. నవ్వుతోనిండిన ఆట ఆడుటకై, నిత్యానందుడు చిరు నగవుతో నన్ను తీసుకొని వచ్చెను. సర్వ ప్రపంచము నన్ను ఎదుర్కొన్నను, నవ్వుచూ ఆడుచునేయుందును. నిత్యానందునికృపచే కొంచమైనను లెక్కచేయను. స్వర్గ నరకము

లోకశ్రేష్ఠమైనవానికి దుఃఖమెక్కడున్నది? నిత్యానందుని ఆశ్రయము పొందిన నాకు విచారమునకు తావెక్కడ? ఇందలి విషయమేమన అర్జునునివలెనే కార్య ప్రముఖులమని బయలుదేరిన వారందరును, అంత్యమున నిర్వీర్యులై తమను అధములుగాను, అశక్తులుగాను, గణించి 'నితాయి' చరణ సన్నిధిని ఆశ్రయము చేసికొనెదరు. తండ్రీ, యీ నటులందరకు యిక్కడ సమానమైన సితి కలదు. అందుచేత తండ్రీ, ఎవ్వరి వాక్కులకును లక్ష్యముంచక, నీ ధర్మ మును నీవు నిర్వర్తించు చుండవలెనని కోరుచున్నాను. నేను పిచ్చి వానివలె మాట్లాడుచుందునన్న మాట నిజమే, కాని నామాటలు కేవలము అర్థ రహితములని అనుకొనవద్దు. ఆనంద రహితత్వమును సూచించుట నే భరించలేను. ఏ స్త్రీ పురుషులనైనా వారి ఆనందమునుండి భంగము చెయుదుననెడి భయము చేత పూర్తిగ తెలిసినప్పటికి, సత్యము మాట్లాడుటకూడ మానుచుందును. ఆనందము కలుగజేయు విషయములను ఎప్పుడునూ స్పష్టముగ మాట్లాడు చుండెదను. తండ్రీ, నే నొక బూరా వంటివాడను. 'నితాయి' బూరాను ఊదువాఁడు. తండ్రి, అందుచేతనే నానితాయి సర్వమూ తెలుసుకొనగలుగును. దేనినికూడ అతనినుండి ఎవ్వరును దాచియుంచలేరు. పదే పదే నేను కోరునది యిదియే.

"సర్వమును విస్మరింపుము. సర్వులును ఒకే ప్రభుని యొక్క ఆదేశములను నిర్వర్తించు చున్నారని తెలుసు కొని ఒకే హృదయముతో పనిచేయుడి. లేకున్న సవతుల మధ్య ఒకే భర్తను పంచుకొని నట్లుండును. అట్టి స్థితిలో

మన పని ప్రభునకు ఆనందమును కలిగించుటకు బదులు బాధను కలిగించును.

ఈ నాడు ప్రచురణ సమితిని ఒక విషయము ప్రార్థింప నున్నాను. ఒక బ్రాహ్మణ స్త్రీ తన కుమార్తెయొక్క వివాహ మునకు యిబ్బంది పడుచున్నది. నీవు తలంచినచో, పది లేక పది హేను రూపాయల వరకు సమితినుండి విరాళము పంపవచ్చును. సొమ్ము మంజూరు చేయబడినచో వెంటనే పంపవలెను. ఈ నా లేఖను రసీదుగా నుంచవలెను. సహాయార్థము తిరుగుచు, యీ బ్రాహ్మణ స్త్రీ జమ్మూ వరకు వచ్చినది. కుమార్తె యుక్త వయస్కురాలైన దగుటచేత నేను కోరుచున్నాను. నీ దానమున కర్హులైన వారు యింకొక రుండరు. ఉదయపూర్ రాజ్యములో నున్న వారిస్వగ్రామమునకు త్వరలో వెళ్లిపోయెదరు. నీవు ఆతురత పడవలదు. నా ఆరోగ్యము బాగుగనేయున్నది.

నీ,

హర.

# లేఖ 12.

తండ్రీ,

(శ్రీయుత గోవింద చంద్రపాల్, బంకూరా)

నీ తప్పును నీవు గుర్తించితివని నీ లేఖ ద్వారా తెలుసు కొంటిని. ఎవరి కృపచేత నీవు తేరుకొంటివో, వారి నామము

తోనే బయలుదేరినచో, నీకు మరణమును కలిగించెడిదా? నీవు వెళ్లినను, వెళ్ళకపోయినను ఒక్కటే. నీవు ఆ గొప్ప ఉత్సవమును జ్ఞప్తికి తెచ్చు కుంటివి కనుకనే తేరుకొంటివి. నీవక్కడికి వెళ్ళియే యుండినచో యింకా ఎన్ని లాభములు పొందియుండెడి వాడవో నేను చెప్పలేను. ఆ ఉత్సవములో వేలాది సాధువులు, గొప్ప వైష్ణవులు, కూడెదరు. వారిని దర్శించు భాగ్యమునకు పోల్చిన మోక్షముకూడ అతి స్వల్ప మగును. ఇంకనూ నీకు వైష్ణవుల యందు శ్రద్ధగాని, భక్తి గాని లేదని నాకు తెలియును. కాని విచారించవద్దు. ఈ వేడిగాలిలో వృధాగా సోనాముఖి బయలుదేరి అనవసరముగ బాధపడ నవసరములేదు. వీలైనపుడో లేక అవకాశము దొరికి నపుడో అచ్చటకు వెళ్ళవలెను. భార్య తప్పుపని చేయమని ఉద్దేశించినచో భయపడని వాడవు, యీ మంచి పని మొదలు పెట్టుటకు ముందే భయ పడితివనిన చాలా వింతగా నున్నది. ప్రభుని యిచ్ఛ అటులనే యున్నదని నే తెలుసుకొనవలెను.

నీ శరీరారోగ్యస్థితి తెలుసుకొని, అహోరాత్రములు ఆతురతతో గడుపు చున్నాను. కాని నే నేమియు చేయ జాలనని భయపడుచున్నాను. తండ్రీ, గతించిన కాలమును తిరిగి పొందలేము. ప్రభువు తన శాసనమును ఒకే ఒకసారి చేయును. తరువాత దాని తీవ్రత తగ్గిపోవును. జాడ్యము చేత సర్వమును వృధాపరిచితిమి. కృపామయుడు నీ మీద దయచూపగలందులకు నే నాతనిని ప్రార్థించు చున్నాను. తండ్రీ నన్నుపట్టిన దుష్టగ్రహము కొంచెములో నా ప్రాణమును

ఉంచినది. నీ నేత్రములతోనే నా స్థితిని చూచితివి. ఇప్పటికి కూడ యథాస్థితిగనే నున్నది. కాని ఒకప్పుడు హెచ్చి, ఒకప్పుడు తగ్గుచుండును. నా నేత్రములు సరిగ పనిచేయుట లేదు. ప్రతిదానిలోను శక్తిహీనుడనై యున్నాను. ఒక పిచ్చివాని రోజులవలె నారోజులుకూడ గడచుచున్నవి. ఈ స్థితిలో యిక్కడ ఉండదలచు కొనలేదు. అందుచేత త్వరలో నా ఉద్యోగమును విడచి, యింటికి పోదలంచితిని.

నీ,

హర.

## లేఖ 15.

ప్రియమైన గోవేందు భూషన్.

నేను జమ్మూ వదలునపుడు ఒక లేఖ, యిక్కడికి చేరి నంతనే యింకొక లేఖ నీవద్దనుండి పొందితిని సర్వుల క్షేమమునకు మూలమైన శ్రీమాన్ నిత్యానందుని చేతనే, నీక్షేమము కూడ చూడబడును. కలత చెందవద్దు. నీవు ఆతురతతో చేయుటకుపక్రమించిన కార్యము మిక్కిలి మంచిది. కాని ప్రపంచము యొక్క స్వార్థము వలన కొంచెము భయ పడుచుందువు. ఏదైనను, నిత్యానందుని నామము జపించుచూ యత్నము చేయుము. రామప్రసాదుని కీర్తనలలో ఒకటి గుర్తుకు వచ్చుచున్నది. "మొదట మణులు పొందజాలకపోతిని కనుక, సాగరమునందు మణులు లేకపోలేదు." అందుచేత

పట్టుదలతో పనిచేయమని కోరుచున్నాను. క్రమేణ నీకోర్కెలు సఫలమగును. నీలో ఒక కోర్కె కలిగినచో దానిని ప్రేరేపించిన "వాడు" వెనుకనే తప్పక ఉన్నాడని తెలుసుకొనుము. "అతని యందు దృఢమైన నమ్మకముంచి, నీక్రియా రంగమున ప్రవేశింపుము. గెలచిననూ, ఓడిపోయిననూ లేశమైననూ విచారములేదు. అది 'ఎవరి' భారమో 'వారి' నెత్తి మీద నుంచుము. నీవు చేతులు ఊపు కొనుచూ ముందుకు పోగలవు. ఈ జగమున ఏ పనిని గాని నీ స్వంత కార్యముగ పరిగణించి- అనవసరముగ నీ తలను ఆలోచనలతో నింపవద్దు. అది 'ఎవరి' కార్యమో వారికి వదలి వేయుము. ఏది ఫలితమో అది ముఖ్య కారణమెన్నడూ కాజాలదని నీ మనస్సున గ్రహింపుము. నేను యీనాడు కొంచెము తొందర తొందరగ నున్నాను. అందుచేత యింతటితో ముగింతును. తీరిక కలిగినపుడు తిరిగి వ్రాసెదను. నేను పెద్దమూర్ఖుడను. నా కెంత మాత్రము జ్ఞానములేదు. ప్రభువు నీకోర్కెలు సఫలము చేయుగాక ! నీ గౌరవనీయమైన తండ్రికి నావందనములు. అతడెట్లున్నాడు ? ఆయన ఆరోగ్య మెట్లున్నది ? తండ్రియగు ప్రకాష్ నా యితర తండ్రులకు నావందనములు. మేము సంతోషముగ నున్నాము. మాకు ఆందోళన లేవీలేవు. తరచుగ ఉత్తరములువ్రాయు చుండుము.

నీ,

హర.



# లేఖ 14.

నమస్కారములతో,

(శ్రీయుత కాళిపద ముఖోపాధ్యాయ, బి. యల్. ధన్‌బాద్)

నేను ఆశించు చున్నంతనే మీలేఖచేరినది. "కోరిక కలుగుట ప్రేమ యొక్క బంధనము" మీలేఖ చేరినంతలో నాస్థితి యట్లున్నది. అయ్యా మీరందరును అనేక సూర్యుల వంటివారు. దీపము యొక్క వెలుగుచేత మిమ్ముల నుద్దీపింప యత్నించుట నాపిచ్చితనము. కాని పిచ్చివాడు సిగ్గుపడడు, ఏలనన అతని చర్యల మంచిచెడుగులకు తనంతట తానే న్యాయాధీశుడు కాజాలడు. మీరందురును, విద్య, తెలివి జ్ఞానములతో కూడిన మహాపురుషులు. ఏవిషయములోగాని మీకు సలహానిచ్చుటకు నేను తగను. కాని నన్ను ప్రేమించి, ఆదరించు మీలో కొందరికి యిదంతయు కోతి చేష్టలుగనో లేక పాములాటగనో తోచుచున్నది. నేను అప్పుడప్పుడు చేయు అనవసరపు ప్రసంగముల వలన కలత జెందవద్దు. "మంత్రింప బడిన రాయి" (Philosopher's Stone) యొక్క స్పర్శచేత ఇనుము బంగారముగ మారినట్లు: జడమును (Matter) చైతన్యము (Spirit) గా మార్చవచ్చును. ఒక్కటే స్పర్శ! ఆహా! యిక ఇనుముకాదు! తదను గుణముగ కృష్ణుడు మనిషి యొక్క బాహ్యాంతరములందు వ్యాపించి యుండినచో, మనిషి 'ఇనుము' గా నుండజాలడు. గోపీభావములచే దీనిని అర్థము

చేసుకొనవచ్చును. పైగా కృష్ణ, గౌరాంగుల ధ్యానము నీ మనస్సులోని సంశయములు బాపుటలో చాల సహాయము చేయును. గొప్పసాధకుడైన నరోత్తమ దాస్ "బృందావనములో, 'అహిర్ గోపికల' యొక్క వంశమందు, బాలికగా ఎప్పుడు జన్మించెదను." అని ప్రార్థించెను. అతడు యింకనూ యిట్లు కోరెను. "ఎప్పుడు యీ పురుషరూపము వీడి, ప్రకృతి రూపమును దాల్చుదును?" అందుచేత ఇనుమును బంగారముగ మార్చు విధానము కలదని తెలియజేయుచున్నాను. నీ ఉద్దేశ్యములో జడ చైతన్యములన్న అర్థమేమి? నీయిష్టమువచ్చినది చెప్పుదువుగాక! కాని జడమును సర్వదా చైతన్యము యొక్క సామీప్యమున నుంచి చైతన్యముగ మార్చవచ్చును. అటులనే చైతన్యమును జడమునకు సమీపముగానుంచిన, దాని గుణములను పొందును. "పురుషుడు ప్రకృతిలో కూర్చుని" అని గీతలో చెప్పబడినది. అటులనే జయ దేవుడు రాధను వర్ణించుచు "కంసుని శత్రువువై (కృష్ణుడు) నప్పటికి, ప్రాపంచిక బంధనములతో కట్టబడితి" వని చెప్పెను. అది అట్లుండ నీ-యీ ప్రపంచమున పనిచేయు చున్న ఇంద్రజాలము యొక్క శక్తి ఎక్కువైనది. "ఇది జరుగుట అసంభవము" అని ఎన్నడునూ భావింపకుము. ఇచ్చట అన్నియు సాధ్యము, అసాధ్యముకూడ. ఆహారముతో పోషింపబడవలసిన శరీరములతో కొందరు ఎట్లు నిరాహారముగ కొన్నియుగములు జీవింపగలుగు చున్నారు? ఏదియూ యిక్కడ అసాధ్యమని అనుకొనవద్దు. జడ చైతన్యముల గూర్చి యీ ఆఖరి మాటను ఆలో

చింపుము. "ఏది రాధయో అదే కృష్ణుడు కూడ." ఈ విష యమునకు అంతులేదు. కృష్ణుడెప్పుడైన ఒకరోజు అవకాశ ము ను ప్రసాదించుచో, నా పురాతన వస్తువులన్నియు చూపిం తును. ప్రస్తుతము నిశ్శబ్దముగ నుందును. నేను చాల మూర్ఖు డను. అందుచే యిట్టి సున్నితమైన విషయమున పాల్గొనలేదు. అట్టి ఆలోచనలన్నియు వదలి, నృత్యము చేయుచు ప్రభుని కీర్తించెదను. ఇంకేదియునాకు తెలియదు. అసమర్థుడ నగుట చే తెలుసుకొన కుతూహలము కూడ నాకులేదు. మహాత్ముల వచనముల బట్టి 'హరినామమే' ముఖ్యమని తెలుసుకొని, ప్రతియొక్కరిని దానిని జపింప మని కోరుచుందును. "కలి యుగములో వేరొకటిలేదు - లేదు - ముమ్మాటికిని లేదు." ఈశితొవచనమును. శిరసావహించి యితరులనట్లుచేయకోరుదును. "నిర్వాణము" "మహానిర్వాణము"లను గూర్చి తెలియక పోవుటచేత వాటిని గూర్చి ఆలోచింపను. దానిని కోరనేకోరను. పిడికెడు అన్నముకొరకు యాచించు భిక్షుగాడిని. అంతటి రాజ్యము యొక్క ఆదాయవ్యయముల లెక్కతో నాకు పని యేమున్నది? ఇతరుల వ్యవహారములలో జోక్యము కలుగ జేసి కొనునట్లుండును. అందుచేత దీని తీర్పుకు తగిన వాడవు గనుక నీకువదలి వేయుచున్నాను. తెలివిహీనుడనైన నావంటి వానికి యిందు మాట్లాడునర్హతలేదు. మానవుల లక్ష్యము "ఆతనిని" చేరి 'అతని' సేవకులుగ నుండుటయే. నా ఉద్దేశ్య ములో అదియే సరియైన మార్గము. దీనిని గ్రహించి మహా పురుషులు "మానవులు కృష్ణ దాసులన్న సంగతి మరచెదరు.

అప్పుడు మాయా పిశాచము చేత, మెడకు ఉరి తెచ్చు కొందురు.” అనిచెప్పిరి. ఎప్పుడు మానవులు తాము సర్వదా కృష్ణదాసులమని మరచి పోవుదురో అప్పుడు దారి తప్పి పలు విధముల బాధపడుదురు. అందుచేతనే వారికి యీ ప్రపంచము ఒక చీకటి గదివలె గోచరించును. కాని నిజముగ యిది ప్రభుని యొక్క ఆనంద భరిత వనము. దీనిని సృష్టించు ముందర, స్థితిలోను, సృష్టి అంతమునందును కూడ ఆనంద మున్నది. అట్టి ఆనంద నివాసము ఆనందరహితమై యుండ గలదా? అందుచేత వివిధ దృక్పథములతో ఒకే వస్తువునకు వివిధ నామము లొసంగినను, నిజముగ బేధమెంత మాత్రమును యుండజాలదని నే విన్నవించుకొనుచున్నాను. నీవు మోస పోకుండగనే ముందు నాపిచ్చితనము యొక్క రుచి చూపించితిని. నన్ను మతి భ్రమించిన వానిగ తెలుసుకొని, నా అసందర్భ వాక్కులను లెక్కచేయకుము. కాని ఆనందమయమైన ప్రభుని రూపము యోగముచేతగాని, విజ్ఞానము చేతగాని, పొందశక్యము కాదని తెలుసుకొనుము. తర్కవాదములచేత సహజము కానట్టి ప్రభుని రూపము గాననగును. యోగమునకు, తెలివికి ప్రభువు, రాజును రాజుకలసి కొన్నట్లు ప్రత్యేక దుస్తులలో దర్శన మిచ్చును. ఆతని కుటుంబములోనివారుతప్పఇతరులు అతనిసహజ రూపమును చూడలేరు. ఆరూపము భయరహితమై సంపూర్ణ సౌందర్యమును కలిగియుండును. అతని ప్రత్యేక దుస్తులలో భయ చిహ్నములు కాననగును. అందుచేతనే కృష్ణుని రూపము తప్ప ప్రభుని యొక్క అన్ని యితర రూపములును అనేక ఆయుధ

ములచేత అలంకరించ బడెను. ప్రభుని కుటుంబమునకు చెందిన వాడవై ఆతనిని చూడ గల్గుదువని తలచెదను. యోగము చేత, తెలివిచేత ప్రభునిపొందుట, వ్యవహార పద్ధతిగ నుండును. అవసరము దాటిన తర్వాత ప్రేమఅంతము చెందును. నీవు చెప్పెదు మహా నిర్వాణము పొందినచో నీకు, ప్రభునికి మధ్య యేమైన సంబంధ ముండునా? నీవు అంతగా యత్నముచేసి, ప్రభుని ప్రార్థించినది పొందినంతనే ప్రభునితోగల సర్వ సంబంధ ములను మరచిపోదువు. పవిత్ర ప్రేమలో, యిచ్చిపుచ్చుకొను ప్రేమ పిపాసను తృప్తిపరచుట అనునదుండదు. ఇందులోనే గోపీభావమున్నది. "గోపీభావ దర్పణములో ప్రతిక్షణము క్రొత్త రూపములు మెరయుచుండును." ఇక్కడ ప్రతిక్షణము వస్తువులు క్రొత్తవై, సుందరమై, మనోహరముగ నుండును. ఈ అనవరత నవ్యత్వము యింకెక్కడనూ కానరాదు. మోక్ష దాయకుని రూపము సదా ఒక్కటే. నీమోక్షదాయకునకు, నా మోక్షదాయకునకు భేధములేదు. అందుచేత ప్రతిక్షణము క్రొత్తరూపమును చూడదలచినచో కృష్ణుని నీవానిగనే, నీబంధువుగనే, ప్రేమింపుము. తండ్రీ, పిచ్చివాని పిచ్చితనము ప్రేరేపించినది. నేను బలవత్తరముగ అదుపు చేయనిచో, యింకెన్నో పిచ్చిమాటలు బయలువెడలును. నామాటలు నీకు రుచింపవని భీతిచెందు చున్నాను. పైగా యీ భేరీ వాయిద్యము ఆపినచో మంచిదని ఆపు చేయుచున్నాను. ఇందు తప్పు పట్టుకొనవద్దు. నీవంటి ప్రాజ్ఞులవద్ద నోరు తెరచుట నాతప్పని నాకు తెలియును. అదిగాక నే నూరుకొన్నచో నీవు

ఆశ్చర్యపడవచ్చును. అందుచేత నేను చేయగల్గినట్లుగ, నా భావములను వ్యక్తము చేసితిని. నేనిపుడు నిశ్శబ్దముగనున్నాను. ఇంక శాంత చిత్తుడవు కమ్ము.

నీ ఆశ్రితుడు,

హార.

# లేఖ 15.

అత్యంతప్రియమైన తండ్రీ,

( శ్రీయుత నందలాల్ పాల్ — చిన్సూరా )

నీ ప్రేమ పూరిత లేఖ చదువుటవలన వెనుకటి ఆనందమును పొంద జాలకుంటిని. నీవు మంచి ఆరోగ్యముతో యున్నావని తెలసినప్పుడే, నా కోరిక పూర్తియగును. తండ్రీ, సర్వమునూ ప్రస్తుతము ఆరోగ్యము పైననే ఆధారపడియున్నది. బాధ్యతా రహితమైన కామ వాంఛలు తమంతట తామే శక్తిని కోల్పోయి, వాటి పనిని ముగించినవి. అందుచేత శరీరమున్నంతకాలము, అది యొక లాభముగానే పరిగణింపుము. నీ ఆరోగ్యమును రక్షించుటలో నీవు అజాగ్రత్తగ నుండరాదు. తండ్రీ, తత్కాలికమైనను, నీవు ఒక్కొక్కప్పుడు కోపము చేత ఉగ్రుడవయ్యేదవు. నీకు ఎక్కువగ చెప్పుటకు నాకు శక్తిలేదు. కాని హఠాత్తుగ వచ్చిన భావ వికారములు జీర్ణకోశమును పాడుచేసి, అనవసర బాధలు కలుగ జేయునని తెలుసుకొనుము. ప్రస్తుతము గృహ కృత్యములు

నడిపింపబడే విధానమువల్ల, అప్పుడప్పుడు క్రోధము సంభవించ వచ్చును. ఈ పరిస్థితులలో గృహమునుండి ఎంత దూరముగ నుండ గల్గినచో నీ ఆరోగ్యమునకంత శ్రేయోదాయకము. ఈ కారణములచేతనే పూర్వకాలమందు 50 సంవత్సరముల వయస్సు మించిన ప్రతివారు ఏకాంతవాసముచేయ నుద్యుక్తులైరి. శరీరము సహజశక్తిని కోల్పోవును. చల్లని వాతావరణముచేత, హిత కరమగు సాంగత్యమువలన దానిని మంచిస్థితిలో ఉంచవచ్చును. "అటల్" వృత్తినుండి విరమించి 'ద్వారక' వెళ్ళుచున్నాడు. నీవు అచటకు పోవునపుడు అన్ని సదుపాయములు చేయబడును. నిన్ను వారు వదలిపెట్టుదురని నేననుకొనను. అటలు ఆతని భార్య రెండుగా కనుపించు ఒక్కస్వరూపము. అందుచేత వారు తలచినపని చేయగలరు. ప్రభువు ఆనందమున వారిని ముంచెను. అటులనే యిక ముందుకూడ వారినుంచును. తండ్రీ, నీవు వెళ్ళ దలచిన స్థలమునకు వెళ్ళవచ్చును. కాని నాతల్లిని వెనుక దిగ విడువవద్దు. ఆమె సదా నీవెంటవచ్చుగాక! ఆమె ఆరోగ్యము కూడ బాగులేదు. ఆమెను నీవెంట నుంచుకొనుము.

తండ్రీ, 'కారార్' వాసియైన పూజ్య మహంతమహా రాజు కొన్ని నిబంధనలకు బద్ధముగా నాకు ఒకగది యిచ్చుటకు తన కోర్కెను దయతో తెలియజేసెను. ప్రభువు అట్టి నివాస ములను అనేకమైనవి నాకు ప్రసాదించెను. అట్టి నిబంధనలకు లోనైన వేరొకటి అవసరములేదు. సర్వజనులు విశ్రాంతి గృహముగ ఉపయోగించుకొనగలిగిన ఒక స్థలము కావలెను. ప్రభుని దర్శనార్థమువచ్చు యాత్రికులకు తగిన విశ్రాంతి గృహము

నేను కోరెదను. నీలాచలుడైన ప్రభువు ఏమి నిర్ణయించునో చూతము. తండ్రీ, యీ స్థలము యీ యిల్లు నా యొక్క స్వార్థముకొరకు నేను కోరుచున్నానని కొందరు బహుశః అనుకొనుచున్నారు. అట్టి ఆలోచన కల్గినంత మాత్రమునకూడ, సిగ్గు అవమానములు నన్ను ముంచుచున్నవి. దయామయుడైన నిత్యానందుడు ఎటులచేయునో చూతము. కాని, తండ్రీ, నీవు కార్యరంగమునకు వచ్చులోపల నేను యేమియు, మిక్కిలిగా చెప్పదలచుకొనలేదు. ఈకష్టతరమైన కార్యము లేఖల మూలమున చేయబడదు. అటుల చేయబడగలిగినను, నేనటులచేయను. దీనిని అపార్థము చేసుకొనవద్దు తండ్రీ. తిన్నగా ఆవలి ఒడ్డునకు నేనునావను నడుపుదునని తెలుసుకొనుము. అందు లేశమంతైనను అనుమానములేదు. ప్రతి ఒక్కరు నన్ను ప్రతిఘటించినను, నా బాధ్యతనుండి రవంతైనను విరమించను. నిత్యానందుడు స్థిరచిత్తుడు. ఎవ్వరును ఆతని కార్యనిర్వాహణలో ఆటంకము కలుగజేయలేరు. ఏదిక్కునకు గాలివీచునో ఒక క్షణము సావకాశముగ పరీక్షింతము: తరువాత మనపని మొదలుపెట్టవచ్చును. ప్రస్తుతము నావను నా అంతట నేనే నడుపుటను కోరుచున్నాను.

నీ ప్రియుడు,

హర.



# లేఖ 16.

అత్యంతప్రియమైన ఆషూ,

(శ్రీయుత ఆషుతోష్‌దాస్ – కదాసోల్)

నీ యొక్క లేఖ నిన్ను గురించి పూర్తిగా తెలియజేయు చున్నది. కృష్ణుడు నీ కోర్కెను సఫలముచేయును. కాని గ్రుడ్డి వాని భుజములను ఆధారముగ జేసుకొని, పర్వతారోహణము చేయుటకు ఆశించుట తెలివి తక్కువైనపని. అది ప్రమాదకరము కూడ, అందుచేత అట్టి ఆలోచన మానవలెనని కోరుచున్నాను. నాకు నీవు తోడుగానుండినచో, నేను కూడ నీతో రాగలుగుదును. నాకన్న పెద్దకుంటివాడుగాని, గుడ్డివాడు కాని యింకొకడు లేడు. నన్ను గురించి యితరులు ఎట్టి భావములు కలిగియున్నను, నేను నన్ను తెలుసుకున్నట్లుగా, యితరులు తెలుసుకొన జాలరు. కాబట్టి, నన్ను గురించి నేను చెప్పునది సత్యమని భావింపుము. నీకు నేనిచ్చిన సందేశము యిది. "నామము జపించుము." నామము మినహాయించినచో, అంతకన్న పెద్ద యజ్ఞముకాని, తపస్సుగాని, బ్రహ్మచర్యముగాని యింకొకటి కానరాదు. ప్రతి యితరమును విస్మరించి, ప్రతిక్షణమును మధురమయమైన కృష్ణనామమును, భుజించుచున్నను, మెలకువగనున్నను, నిద్రలోనున్నను కూడ జపింపుము. నామము జపించునపుడు, ఆసనము ప్రాణాయామము, అంగన్యాసము, భూతసుద్ధి, యిత్యాది (యోగసాధనలకు అవసరమైనవి) ఎంత మాత్రమును

అవసరములేదు. గంగాజలమును మంత్రోచ్చారణలచేత పవిత్రము చేయ నవసరములేదు. సదా పవిత్రమైన నామము, మరింత పవిత్రముగనే ఉన్నది. గంగా జలముయొక్క పవిత్రత, విష్ణుపాద స్పర్శచేత కలిగినది. అందుచేత నామము గంగా జలము కన్న పవిత్రమైనదనే విషయము నిర్వివాదాంశము. అందుచేత, సమస్త మును త్యజించి నామములో మునిగి యుండుము. నామమే నీకు నిజమైన మార్గము చూపించగలదు. బాహ్య సంబంధమైన సహాయము అవసరములేదు. అంధకారమును నిర్మూలించు జ్యోతియే నామము. ఆజ్యోతియే, అంధకారములో సరియైన మార్గము తెలుసుకొనుటకు నీకు సహాయముచేయును. గౌరవ భావముతో నామము జపించుచూ, నామస్మరణచేయు యితరులతో చెలిమిచేసి ధన్యుడవుకమ్ము. మీరిద్దరును ఒక్కరై, నామమును జపింపుడు. బిడ్డలు అపరాధముయొక్క ఫలితమని తెలుసుకొని, వారిని పొందుటకు కుతూహల పడవద్దు. ఈ నిరోధింప బడిన ఫలమును మీరు తినకుండుట మంచిది. వారిని పొందినవారికి పశ్చాత్తాపము తప్ప యేమియులేదు. అందుచేత అట్టి విలువ హీనమైన చర్యలలో లగ్నము కాకుండుట మంచిది. నీవు ఒక్కడివి. ఇప్పుడు యిద్దరు. ఇకముందు ఎక్కువ చేయుటను కోరవద్దు. మీ రిద్దరూ ఒక్కరిగా అయిన తర్వాత, సరియైన ఆధ్యాత్మిక శరీరమును పొంది, వ్రజ భూమికి (గోలోకమునకు) బయలుదేరండి. మీ రిద్దరూ ఒక్కటే స్వరూపముగ మారకుండ అచ్చటికి పోజాలరు. శాంత, దాస్య, సఖ్య, మధుర (వాత్సల్యము) భావములన్నిటి లోనూ మధుర భావమే నిజముగ తియ్యని

భావము. కాబట్టి, దానిని రుచిచూచుటకై కోరుచుండుము. వర్షములు కరియు ఋతువు నాకు దాటిపోయినది. శీతాకాలములో ఆనకట్టలు కట్టుటవలన ప్రయోజనమేమున్నది? చాందీదాసుని వచనములు నాస్థితిని శ్లాఘనీయముగా వర్ణించును, "సముద్రము ఎండిపోయినది, కాని వజ్రము యింకా కప్పబడియేయున్నవి. అంతయూ నా కర్మయొక్క దురదృష్టము." నా సర్వస్వమూ ఎండిపోయినది. నిష్ఫల యత్నములచేత నేను దుఃఖించుచున్నాను. నా ఉదాహరణచేతనైనా జాగ్రత్తతో ఉండవలెను. శ్రీకృష్ణుని పూజించుటకై ప్రస్తుతమే సరియైన కాలమని తెలుసుకొని ముందుకు వెళ్లవలెను. అచిర కాలములోనే కృష్ణునికి నీపై దయకలుగును. నీవు ధన్యుడవయ్యెదవు. కృష్ణ ప్రేమలో నీవు దొర్లుచూ, ప్రపంచమంతటనూ కూడ వెదజల్లుదువు. శ్రీకృష్ణ నామమే మనచుట్టు ఉన్న ప్రతిదానియొక్క ఆధారము — మరియు మూలముగ తెలుసుకొని, నామములో ఆశ్రయము పొందుము.

నీ,

హర.

## లేఖ 17.

నా అత్యంత ప్రియమైన తల్లీ,

( ఆనందమయసేనుని భార్యకు )

నీ లేఖను చదువుటచేత మిక్కిలి ఆనందమును పొందితిని. తల్లీ, వైద్యునియందును, ఔషధమునందును విశ్వాసము కలిగి

ఘుండుటయే రోగిచేయవలసిన పని. ఫలితమును గూర్చి చింతించుట రోగి యొక్క ధర్మముకాదు. అందుచేత వైద్యులు రోగపీడితులై నపుడు బాగుపడరు. అందువలన, తల్లీ, ఔషధము సేవించనిమ చెప్పుచున్నాను. రోగ లక్షణములన్నియు అదృశ్యమగును. మొదట రోగమును నివారించి, తరువాత ఔషధము నిచ్చునట్టి వైద్యుడు ఈ ప్రపంచమునలేడు. రోగమును నిర్మూలించుటయే ఔషధముయొక్క గుణము. రోగముతగ్గినతరువాత రోగము యొక్క గుణములెక్కడుండును? అందువలన నేనుచెప్పునది, తల్లీ "ఔషధ మునుసేవింపుము" నీవునాతల్లివి. అందుచేత నీకు నీమేఘనమైన వైద్యురాలివి. కాని నిరోధించుటకు అవశుడనై, అట్టి తెలివి తక్కువమాటలు వ్రాయుచుందును. ప్రియమైన తల్లీ, యిది నా తప్పుకాదు; కేవలము నాప్రేమానురాగములయొక్క తప్పు. తల్లీ నాయొక్క అనవసర ప్రసంగములను మన్నింపప్రార్థించుచున్నాను. నీవు నా ప్రభునకు వియోగరహితమైన సహచారిణివని నేను గుర్తించితిని. ఇపుడు మమ్ములను నీచేతిలోనికి తీసుకొని, దయతో మా హృదయేశ్వరుని సన్నిధికి తీసుకొని పోవలయును. కృష్ణుడే జగన్నాథుడు. నా నాథుడులేకుండగా ఎన్నాళ్ళు జీవింప గలుగుదును? తల్లీ, చిన్నవయస్సులో పుట్టిల్లు ప్రియకరముగ నుండవచ్చును. కాని యిప్పుడటులుండ గలదా? నా హృదయ మిప్పుడు "నాథుని" కొరకు తపించుచున్నది. కోటివిధములుగ ప్రియకరమైన కార్యములు తల్లి దండ్రులు చేసినను, నాకు తృప్తి యుండదు. తల్లీ ఎంతకాలము కృష్ణుని తెలిసికొనరో, అంత కాలము జీవులుమైమరచి మాయా ప్రపంచమున కట్టుబడి

యుందురు. ఇసుకతోను, దుమ్ముతోను వారు గృహములను నిర్మింతురు. కాని సరియైన క్షణము సమీపించినచో యిట్టి క్షుద్ర విషయములతో వారు తృప్తి పడెదరా? అట్టి స్థితిలో, భుజించుచున్నను, నిద్రించుచున్నను, మాట్లాడుచున్నను, వారు "నాథు" నే తలచుచుందురు. బరువైన హృదయములు గలవారై, ఆతనినే కోరుచుందురు. జగద్ వ్యాపకమైన 'నాథు' ని రూపమునే యెల్లవేళలవారు చూచుచుందురు. ఏ వస్తువుపై దృష్టిపోకినను, నాథునియొక్క మూర్తినే గాంచుచుందురు. వేదాంతము యీస్థితినే "బ్రహ్మమయం జగత్" అని వర్ణించినది. ఒక భక్తుడు యీస్థితిని వర్ణించుచు "ఎవ్వడును చరాచర జగత్తును చూడడు. ప్రతి ఒక్కడూ ప్రభునియొక్క మూర్తినేగాంచును. కనులు ఏవైపునచూచినను కృష్ణుని రూపమే గాన నగును." అని చెప్పెను. నీమనస్సు అదే విధముగ నున్నది. అందుచేత నావంటి బాలికయొక్క తెలివిహీనమైన వాక్యములు నీకు ఎట్లు రుచించును? నామాటలు ఇంకెప్పుడునూ నీ హృదయమును చేరవు. ఆవిధముగ నేనుకూడ వియోగ దుఃఖముల ననుభవించినపుడే మనిద్దరి స్థితి ఒకే విధముగనుండును. తల్లీ, అట్టిరోజు ఎప్పుడు వచ్చును? నీవలెనే హృదయేశ్వరుని కొరకు తపించి దుఃఖించు రోజు ఇంకనూ యెంతదూరమున్నదో? ఒకప్పుడు దుఃఖింప మొదలిడినచో, మాయాప్రభావముచేత సిగ్గునకు లోనగుదును. ఎవరైననూ కృష్ణనామమును జపింప నుద్యుక్తులైనచో, వివిధములైన ఆటబొమ్మలచేత అతనిని మారు త్రోవకు తీసుకొనిపోవుటకు మాయాదేవి యత్నించును. అయినప్పటికి

అతడు నివారింపబడనిచో, మాయాదేవి నిందించి శిక్షించును. అట్టి చర్యలలోకూడ మానవుడు అచంచలుడైనచో, కృష్ణుడు తన సన్నిధికి పిలచును. తల్లీ, భక్తులు యీస్థితిని వర్ణించుచు "ఎవ్వరు ఆతని (భగవంతుని) కోరుదురో అతనికి దుర్భర కష్టములు కలుగజేయును" అని చెప్పిరి. తల్లీ, మాయాదేవి యొక్క రుూడిపింపులకులోనై, కృపా ప్రేమ సదానందములకు నిధియైన ఆ హృదయనాథుని దివ్యనటన మరువకుందుముగాక! తల్లి నేను కేవలము బాలికను. నా "నాథుని" దరిచేరుటకు భీతిల్లుచున్నాను. నా చేయిపట్టుకొని ఆతనిదరికి నీవు తీసుకొని పోవలెను. ఒకసారి 'అతనిని' చూచినచో యింక భయపడను. అపుడు నా యుక్తి పన్నాగములచేత నా అంతట నేనే రహస్యముగ కలుసుకొందును. ఒక్కసారి ఆతనిని చూపించుము. ఇకముందు నీ సహాయము కోరను. తల్లి భ్రమింపబడిన నీ కుమార్తెను యింక తబ్బిబ్బులు చేయవద్దు. తల్లీ, నీవెవ్వరివో యిపుడు తెలుసుకున్నావు గనుక, యింక నన్ను భ్రమింపజేయవద్దు. నా మనోభావములు లేఖద్వారా తెలియజేయ తరమా? దయతో ఏదోయొక రోజుననిన్ను కలుసుకొను భాగ్యము ప్రసాదించినచో అపుడు నా హృదయమునంతను తెలియజేతును. తల్లీ, అట్టిరోజున్నదా? నాతండ్రి చంద్రశేఖరుడు ఆరోజు తీసుకొని వచ్చుటకు యత్నము చేయుచున్నాడు. కృష్ణుడు అతనికి సహాయము చేయుగాక! అట్టియెడ నావలె ఖేదపడినట్టి పెక్కు జనులు శాంతించెదరు. అతని సదాభిలాషను కృష్ణుడు నెరవేర్చుగాక! ఇంతదూరమైన స్థలములో నన్నుంచవద్దు. చిన్నవస్తువులు

కూడ నన్ను భయపెట్టునంతగా నేను భీతిల్లితిని. కృష్ణనామమును జపింపుము. సక్రమముగా నున్నదా ? లేదా ? అనే ప్రశ్న లెక్కచేయునవసరములేదు. నామము జపించినచో ఈ జగత్తునందలి ఆకర్షణ క్రమముగ క్షీణించును. జగత్తునందుఆకర్షణ నశించినచో, మాయా మోహములు అదృశ్యమగును. మాయాప్రభావము తొలగినంతనే మాయలో నున్న, యిళ్ళు, గదులు, వృక్షములు, ఆకులు, సర్వము అదృశ్యమగును. ఇదివరలో సుఖముగ కనుపించిన దంతయూ, భ్రమయని యపుడు తెలియ నగును.

నీ పుత్రుడు,

హర.

# లేఖ 18.

తండ్రీ,

(శ్రీయుత గోవిందచరణపాల్, బంకూరా)

తండ్రీ, శరీరమును ధరించుటలోనే బాధయిమిడి యున్నది. కారాగారములో శిక్షఅనుభవించువాడు సుఖము నుపేక్షించినచో, యితరులకన్న ఎక్కువగ బాధపడును. ఈ శరీరము కారాగారము కన్న ఎక్కువకాదు. కాల పరిమితి దాటిన తరువాత ప్రతియొక్కరును విముక్తులగుదురు. ప్రశాంత ముగ ఖైదులోనుండిన, వారి బాధయొక్క తీవ్రత క్రమేణ తగ్గింపబడును. ఏలనన కారాగార అధికారి వారియందు దయగలవాడై, వారి తృప్తికి సుఖమునకు సహాయపడును. అందువలన, తండ్రీ, నీబాధల మధ్య ఆ ప్రాణమునకు ప్రాణమైన

వానిని మరువకుము. మరియు అతనిపై నేరమును మోపవద్దు. అన్ని బాధలను భరింప యత్నింపుము. అపుడు అన్ని బాధలును నిర్మూలమగును. తండ్రీ నాఆటకూడ అంతమునకు వచ్చు చున్నది. ఈ ఆట పురాతన మయిపోయినది. మరొకస్థలమున క్రొత్త ఆటకై నేను తయారగుచున్నాను. కృపామయుడైన కృష్ణుడు ఏనాడు నన్నాస్థలమున చేర్చునో తెలియదు.

తండ్రీ, అత్యంత ఆతురతతో నుండుటవలన ప్రయోజనములేదు. తండ్రీ. ప్రభుని శాసనముల భారమును తెలుసుకొనలేక మనముచేయు పనులు, ముందు మనకు గొప్ప బాధను కలిగించి, పశ్చాత్తాపమునకు హేతువులగును. కాని అప్పుడు మిక్కిలి ఆలశ్యమగును. ప్రయాణముచేయగలుగుదువను విషయము పూర్తిగ తెలుసుకొని, మనోహరుని దర్శనార్థము వెళ్లివలసినదని వెనుకటి ఉత్తరములో నిన్నుతొందర చేసితిని. కాని తల్లి నిన్ను వెళ్లనిచ్చుటకు యిష్టపడలేదు. నీ ఉద్యోగ భంగమగునేమోనని భీతిల్లు చుంటివి. ఇప్పుడు యీ బాధంతయు ఎవరు భరించెదరు? మనోహరుని రక్షణయందుండుము. ఆనందముగా నుండగలవు. ఉత్సాహముతో నామము జపింపుము. నామము నెన్నడూ మరువవద్దు. మానవుడు తన 'కర్మ'ల యొక్క ఫలితమునే అను భవించును. కాని నేరమును యింకొకరి శిరస్సుపై నుంచ దలచును. అది చాల తప్పు.

నీ,

హార.

# లేఖ 19.

సోదరుడు అభయకు,

నా లేఖ నీవు పొందలేదని నీ ఉత్తరమువల్ల తెలుసుకొంటిని. కాని, సోదరా! నిజముగ నీ వంతగా యీ విషయము వలన కలత చెంద నవసరములేదు. నేను నీ వాడను. అందుచే పరునిగా నన్ను ఎంచ వద్దు. నీ తలి తండ్రులకు నీ వెటులనో నేను కూడ అట్టివాడనే. నన్ను మీ వారిలో ఒకనిగా యెంచుడి. నేను దానికి అర్హుని కాకపోవచ్చు. అది నాకు రానున్న దాని యందలి అధికారము పోగొట్టవలెనన్న కారణముకాదు. అప్పుడప్పుడు నాకు లేఖలు వ్రాయు చుండుము. నీ లేఖలు నాకు మిక్కిలి ఆనందము నిచ్చుచున్నవి. మరొక విషయము. ఇక్కడకు వచ్చుటకు ఆతురత పడవలదు. వీలయినపుడు మాత్రమే రావలెను. లేక కొలది కాలములో మనము కలుసుకొందుము. కాని తరచుగా "రాధావల్లభుని" నీవు కలుసుకొను చుండవలెను. అతడు కృష్ణునకు యిష్టుడగుటచేత మనందరికన్న అతడు అదృష్ట వంతుడు తరచుగా అట్టి సాంగత్యమును నీవు ఉపయోగించుకొనుము. నామనో ఆత్మలయొక్క కోర్కెలు నాహృదయ ధనాగారమైన కృష్ణ చంద్రునకే అర్థమగును. ఒక్కొక్కప్పుడు సర్వమునూ నావెనుక మరచి మిమ్ములనందరను కలుసుకొనుటకు రావలెనని తోచుచుండును. నేను మీ దగ్గర తిరుగ గలిగెడి రోజును ఎప్పుడు కృష్ణుడు ప్రసాదించునో నాకు తెలియదు నా కోర్కెలు దిన దినమును వృద్ధిచెందును. ప్రియసోదరా! మీరు

ప్రభునకు ఆప్తులు. మీరు ఆతని స్వజనమే. అందుచేత మీ సాంగత్యము మాకంత ఆకర్షణీయముగా నున్నది. సోదరా! నన్ను తరిమివేయవద్దు. నీ దళములోనికి గైకొనుము. నా సర్వ ఆశయములు, కోరికలు నీ మీదనే ఆధార పడి యున్నవి. నీ శక్తిచేతనే, దయామయుడైన 'నితాయి' నామీద దయచూపించుచున్నాడు. నీ సుగుణములచేతనే యిదంతయూ సాధ్యమైనది. ఇందలి లేశమైనను నాలోలేదు. ఇది సత్యమని గ్రహింపుము. నా, హృదయము ప్రేమ శూన్యమై, మృధు భావలేశమైననూ కలిగి యుండదు. ఎప్పుడు మీ హృదయములు, ప్రవాహావేగములో తలుపులు పగుల గొట్టి, చుట్టునున్న సర్వమును ముంచి వేయునో, అప్పుడు నా హృదయము కొంచెము మృధువగును. నీ సాంగత్యమునుండి వేరుచేయబడిన వెంటనే, తిరిగి తన యొక్క ఎడారి స్థితికి వచ్చును. ఆ కారణమే నన్ను నీ సాంగత్యము కొరకు కుతూహల పరచు చున్నది

సోదరా! నీవు తెలియజేసిన ఒకభావము నన్ను దుఃఖింప జేసినది. నీకు ధనము అవసరము లేదన్న మాట నిజమే. కాని నీవు ధనార్జన చేయకూడ దన్న మాటకు అది తగినంత కారణమా? అట్టి భావము నీస్వార్థ రహితత్వమును ఎతింగించునా? నీకన వసరము కావచ్చును. కాని అవసరమైన అనేక వందల జనులు కలరు. అందు చేత నీవంటి వానికి నీ ఒక్క బాధ్యతను మాత్రమే వహించి, యితరులను ఉపేక్షించుట తగదు. అందు చేత నా ఉద్దేశ్యములో నీవు ఉద్యోగము అంగీకరింప కూడదనే ఆలోచనను మానవలెనని తోచుచున్నది. అందుల కింకొ

రహస్యకారణము కూడ నున్నది. అదృష్టితో చూచిన, నీవు తప్పక ఉద్యోగములో చేరవలెనని తోచుచున్నది. నీకు అర్థమగునట్లు చేయగల శక్తి నాలో లేదు. కాని నేను చెప్పగలిగిన దంతయూ యేమన, ఆత్మకు యితరులకు మధ్యచాల వ్యత్యాసమున్నదను విషయము మాత్రమే. ఉద్యోగము చేయకూడదనే భావమును విసర్జించుట నీ ముఖ్యధర్మమని దయయుంచి గుర్తించుము. సోదరా! అది యీ విధముగ నున్నది. సవ్యముగ ప్రవహించు రక్తము శరీరమును పోషించును. కాని ప్రవాహ రహితమైన, స్థిరమైన రక్తము హాని కలుగజేయును. అటులనే ధనము నార్జించి, ఖర్చు చేయుట మనస్సును మృదువుగనూ, పవిత్రముగనూ చేయును; అటులనే కూడబెట్టిన ధనము దానిని పాషాణముగనూ, అపవిత్రముగను చేయును. ఈపై సూచించిన లక్ష్యముతో ధనము నార్జించిన ఎడల మనసును దేహమును పవిత్రముచేయును. నీవు కూడ ఉద్యోగము నంగీకరించి, నీతల్లి తండ్రుల సంతోషముకొరకు సేవ చేయవలెను. సోదరా! నీతర్కము ముందర నామాట ఒక్కటికూడ సరిరాదనియు, నీ నిశ్చితాభిప్రాయ ప్రవాహములో నా భావములు కొట్టికొని పోవునని తెలిసిననూ కొద్ది మాటలు చెప్పకుండ ఊరకుండ జాలకుంటిని. నేనిక్కడ వ్రాయుచున్న అర్థరహిత వాక్యములను దయయుంచి పరిగణింపకుము.

సోదరా! ఆలోచన నాహృదయములో నున్నను నోటిలోనికి మాటలు వచ్చుటలేదు. మరియూ నోటిలో మాటలున్ననూ, వాటి నన్నిటిని సరిగా లిఖితముగ తెలియ జాల

కున్నాను. అందు చేతనే ఇంత అనవసర ప్రసంగము జరుగు చున్నది. నీవు తెలివైన వాడవగుటచేత నేను నీకు వ్రాయ నవసరములేదు. ఈ (అర్థ రహిత) మిశ్రమునుండి నీవు ఏరు కొనుము. సోదరా! అన్ని దిక్కులలోను ఒకేరీతిని జాగ్రత్త వహించుటయే తెలివియొక్క పరీక్ష. నేను పెద్ద తెలివి హీనుడ నగుటచేత అన్నిదిక్కుల నష్టపోతిని. ఈ కష్టములో సుఖముగా నున్నాను. యేలనన నిత్యానందు డీ సర్వమునకు ప్రభువు. సోదరా! క్రమేణ నామనస్సు, దానితో నాశరీరము అశక్తత నొందు చున్నవి. ఎన్నాళ్లు యీస్థితి యుండునా యని ఆశ్చర్యమగు చున్నది. సోదరా! ఆట పురాతన మైనది. ఇంక నాకు అందులో సంతోషము కలుగుటలేదు. క్రొత్త ఆటకై ఎంతో తపించు చున్నాను! ఖేలాధికారి యైన కృష్ణుడు యింకొక ఆట మొదలిడెనో, లేదో తెలియదు. సోదరా! మీరందరూ ఆటను సంతోషముగ ఆడుచూ ముందుకుపోయి, నన్ను వంట రిగావదలి వేతురుగాక!

నీ,
హర.

## లేఖ 20.

తండ్రీ, భూతానాధ్

(శ్రీయుత భూతనాధ ముఖోపాధ్యాయ, మన్‌భూమ్.)

నీ లేఖ చదువుటచేత తిరిగి చిరునవ్వు కలిగినది. పిచ్చివాని మాటలు యింకొక పిచ్చివాడే అర్థము చేసుకొనగలడనే

విషయము తప్పకనిజము. న్యాయ ప్రవీణ్యులు అక్కడ పనికిరారు. ప్రియమైన తండ్రీ, నీవు పిచ్చివాడనని బాగా తెలుసుకున్నాను. నిజముగా నీ పేరే దానిని తెలియజేయుచున్నది. కాని నీవు యింకా యెక్కువ పిచ్చివాడవు కావలెననియే నా ప్రార్థన. తండ్రీ, యీ ప్రాపంచిక జీవితమును యెదుర్కొనుటకు భయ పడకుము. ఏలనన, దీనివలననే నీవు ఒక ఆశ్రయమును పొంద గలవు. హఠాత్తుగ యిప్పుడే దీనిని అగౌరవ పరచినచో నీవు కృతఘ్నుడ వయ్యేదవు. ఎందుకొరకు యీ ప్రాపంచిక జీవనము నియమింప బడెనో అందులకే దానిని ప్రేమింపుము. అది శాశ్వత మని భావించి మోసపోనలదు. నీవు ఏరూప మియ్యదలచుకొనిన, ఆ రూపమే యీ ప్రపంచము ధరించును. దాని (ప్రపంచము)నుండి కారాగారమును గాని, నరకమును గాని, స్వర్గమును గాని నీవు తయారుచేయవలెను. ఇదిగాక నీవు తగు జాగ్రత్త తీసుకొన్నచో, దీని నుండి పవిత్ర బృందావనము తయారుచేసి సుఖముగ నుండ గలవు. ఈ విషయములు వ్రాయుటకు అంత సులభమైననూ, వాటిని క్రియా రూపమునకు తెచ్చుట అంత సులువుకాదు. కాని యీ ప్రపంచమున ఎవ్వరైనను, ఏది కోరుదురో దానిని పొందగలరు. కావున దీని కొరకే అహర్నిశములు, ఆ ఉన్నతాధి కారిని ప్రార్థింపుము. 'అతడు' ఇచ్చుటకు సిద్ధముగనున్నను, ధన సంతానాది పారితోషికములను అంగీకరింపవద్దు. అపుడు నీ మనో వాంఛలు సఫలములై, ఈ ప్రాపంచిక జీవనము ఎంతమాత్రమును భయపూరితము కాదని గ్రహింపగల్గుదువు. ప్రియమైన తండ్రీ, చందీదాస్, విద్యాపతి, రామానంద' జయదేవుల వంటి ప్రతి

ఒక్కరూ, యీ ప్రాపంచిక జీవనములో శరణు పొంది అత్యుత్త మానందమును బడసిరి. దీనిని నిరూపించుటకే, గౌరాంగుడు, యావజ్జీవ బ్రహ్మచారి యైన నిత్యానందుని, జీవి తాంతములో గృహస్థాశ్రమమును తీసుకొన నాజ్ఞాపించెను. ప్రియమైన తండ్రీ, యీ ప్రాపంచిక మానవునకు, ప్రపంచమొక ఖైదు వంటిది. కాని యితరులకు అదియొక ఆహ్లాదకరమైన దృశ్యము. ఎక్కువ కుతూహల, ఉత్సాహములతో, అనేకమంది ఖైదును చూచుటకు పోవుట నీవు చూడ లేదా? అందు అమిత సంతోషమును పొందుదురు. ఈ ప్రాపంచిక జీవనమును కూడ అదేవిధముగ అంగీకరింపుము. తండ్రీ, జంతువులను పట్టుకొనుటలో, ఒకడు వలపన్ని వేచి యుండినపుడు మరి యొకడా జంతువును వల దిక్కుకు తరుమును. అందుచేత కృష్ణుని పట్టుకొనుటకు యిద్దరు కావలయును. ఆతనిని పట్టుకొనదలచినచో మీరిద్దరును ఒక్కటిగనే మారవలయును. మొదట నీవెంత మాత్రము హడావడి చేయ రాదు. ప్రశాంతముగ నీపనిని నిర్వర్తింప వలెను. అతనిని పట్టు కొన గల్గుదువు. తండ్రీ, మరొకవిషయము. ఆతనిని పట్ట దలచిన వలలో నీవే పడరాదు. నీవందు ఒక్కసారి పడినచో తిరిగి విముక్తిపొందుట దుస్సాధ్యమగును. నీవు పట్టుకొనదలచినది దగ్గరకు వచ్చినను తప్పిపోవును. అపుడు వలకు యితరులను పట్టు కొనగల్గు శక్తికూడ పోవును. జాగ్రత్త, దూరదృష్టితో మెలగుము. నీకు గొప్ప ఆనందము కలుగును. ప్రాపంచిక జీవనము చేయుము. కాని బంధనములలో తగులు కొన వద్దు. ప్రియమైన తండ్రీ, పంజరములో బంధింపబడిన పక్షిని ప్రేమించుట

వలన పొందు ఆనందము, పక్షి స్వేచ్ఛగా వనమున నున్నపుడు ప్రేమించుట వలన గలుగు ఆనందము వంటిదికాదు. పైగా అన వరతము ఆందోళన కలిగించు చుండును. ఈనాడు ఆహారము తీసుకొనదు. రేపు పంజరము పగులగొట్టి యెగిరిపోవును. అట్టి పరిస్థితులలో ప్రతిదినము నీ మనసున యెంత విచారముండునో ఊహింపుము. అందుచేత నీ సద్భావమును కూడ నీవు పోగొట్టు కొన వలసి వచ్చు స్థితి యేర్పడును. అందుచేత స్వేచ్ఛగా ఉన్నట్టి పక్షిని ప్రేమించుట నేర్చుకొనమని చెప్పుచున్నాను. ప్రపంచమును నీ దానిగా జేసుకొనుటకంటె ఘనమైన సంతోషములేదు. ప్రపంచమును నీదానిగ జేసుకొన దలచినచో, రోగనివారణకు, రోగము యొక్క మూల కారణము తెలుసుకొనవలసినట్లే "కారణ ములకు కారణమైన" కృష్ణ చరణములందు శరణు పొందవలసి యుండును. కృష్ణ చరణములు నీవిగా జేసికొన గల్గిననాడు, ప్రపంచములోని సర్వమూ నీదై యుండును. తండ్రీ చెట్టుయొక్క మూలమునందు నీరుపోసినచో, ఆకులు పువ్వులుకూడ తడుప బడుటలేదా ? భూమిపై నీరుపోసినంతనే, పళ్లు, పువ్వులు, ఆకులు భూమినుండి యెంత దూరములోనున్ననూ వినోదస్థితిని పొందును. శరీరాత్మలతో కృష్ణచరణములందు శరణుపొందుము. నీవు కృతార్థుడవయ్యెదవు. తండ్రీ నీ విప్పుడైననూ ప్రపంచము ఏహ్యమైనది కాదని తెలుసుకొనగలిగితివా ? ప్రపంచము సుఖించుట కుపయుక్తమైన స్థలము. తండ్రీ, ప్రాణ పోషణ కను గుణమైన ఆహారమే దుర్వినియోగము చేసినచో, ప్రాణహాని కూడ చేయగలదని నీవు విని యుండలేదా ? సారా మొదలగు

వికార రూపములలో సేవించిన ప్రాణ నాశనము కల్గును. ప్రపంచముకూడ అట్లే యున్నది. ప్రపంచమును దుర్వినియోగము చేసిన వానికది యొక బంధనముగా వర్తించును. నిజముగ బాధ కరమైన విషయమే! ప్రపంచమును నీ బంధమునకు లోనై యుండునట్లు చేయుము. కాని ప్రపంచబంధనములో నీవుండకుము. ప్రియమైన తండ్రీ, పిశాచముచే పట్టుబడినవాడు మరణింప వచ్చును. కాని అదే పిశాచమును లోబరచుకొన్నచో, ఆశ్చర్య కరమైన చర్యలు దానిచే చేయించలేదా? భార్యయే ముఖ్య భయకారణమైన యీ ప్రపంచమువలన భీతి చెందకుము. నీకు హితవైనట్లుగా ఆమె శీలమును సరిదిద్దుము. అత్యంత సుఖమును పొందగలవు. భార్యను పరురాలిగా గాని, సంతానోత్పత్తికై ఒక యంత్రముగా గాని పరిగణింపకుము. ఆమె నీ నుండి భిన్నురాలు కాదు. మీరిద్దరు నీ ఆత్మయొక్క రెండు స్వరూపములు. ఈ ఖేలయే, జడచైతన్యముల ఖేల యని చక్కగా నీ సోదరుని చేత వర్ణింపబడెను. మొదట జడమే వ్యక్తమగును. కాని లోతుగా పరిశీలించి చూచినచో, ఒక్క చైతన్యము మాత్రమే వ్యక్త మగును. ఇది వ్రాయుటకు సాధ్యముకాదు. ఇది వర కెన్నడును ఎవ్వరును వ్రాయుటలో కృతార్థులు కాలేదు. కృష్ణుడు మనకట్టి దినము ప్రసాదించినచో స్వయముగా చేతనగు వరకు నేను స్వయముగ తెలియజేతును. నీ బి. యల్. సోదరుని యీ దరిద్రుని 'కేసులో' సహాయముచేయుమని చెప్పుము. అతనికి ఫీజు కట్టుకొన గలిగినంత రాబడి నాకులేదు. వారు యిక్కడ, అక్కడ కూడ న్యాయ వాదులగుటచేత, అక్కడకు వెళ్లుటకు

ముందుగనే నా 'అర్జీ' దాఖలు చేసుకొనుచున్నాను. నాయందు దయగలిగి యుండమని మనవిచేయుము. నేను అసహాయుడను. అందరునూ నాపై దయచూపెదరుగాక! నీవు పొందిన పుస్తకమును క్షుణ్ణముగా నివు చదువ వలెను. నీ ప్రశ్న లన్నిటికి, సమాధానము నీ మనస్సు యిచ్చును. నీ బి. యల్. సోదరుడు ఆత్మరక్షణగూర్చి వ్రాసెను. దాని విధానము ఆయన వద్దనుండి తెలుసుకొనుము. ఆత్మరక్షణ ముఖ్యధర్మమన్న సంగతి చాల నిజము. తండ్రీ, శరీరపోషణకు ఆహారమెంత అవసరమో అదియూ అంతే అవసరము. మీవంటి తండ్రులను పొంది, నా మనో వ్యాధుల నుండి తప్పింప బడుటలో నేనెంతయో అదృష్టవంతుడను. మీ వల్లనే యీ విచారకరమైన ప్రపంచము విష్ణువుయొక్క వైకుంఠము వలె ఆనంద కరముగ నున్నది. నేను దీనిని విడచుటను కోరుటలేదు. అట్టి ఆలోచన కూడ బాధకరముగా నున్నది. నా ప్రభువు అత్యంత కృపామయుడు. నా ప్రియమైన తల్లి బంకూరా వచ్చుటలేదూ? ఆమె వదనము నామనస్సు ముందుసదా కనుపించుచునే యున్నది. నాతల్లి ఆనంద భరితమై యుండును. చిరునగవు ఆమె ముఖముపై తాండవించును. కారణము లేకుండ నే నామెను తల్లియని పిలువలేదు. తల్లి ఎట్లుండవలెనో అట్టిదే నాతల్లి. ఎవ్వరైనను తల్లి యెట్లుండునో చూడదలచినచో వచ్చి నా తల్లిని చూడవలెను. తండ్రీ, ఒకడు సదా మునిగియే యున్నపుడు యింకెక్కడ మునగ వలసి యుండును? నీవు యిష్టము వచ్చినపుడు మునిగెదవు, లేక తేలుచుందువు. నీవు ఉదార ప్రేమ యొక్క సజీవ ప్రకటన. మిగిలినవారు మునిగియేయున్నారు.

అది నిజమే. కాని వారందరును అనేక రాళ్లవంటివారు. కృష్ణ ప్రేమలేని స్థలములేదు. అందుచేత అందరునూ ఆ ప్రేమ సముద్రమున మునిగియే యున్నారు. కాని తేడా యేమన, కొందరు సజీవులై యున్నారు, కొందరు రాళ్లవలె నిర్జీవులై యున్నారు. తండ్రీ, నీ విపుడెక్కడ నున్నావో, తెలియజేయుము. దయతోను ప్రేమతోను నన్ను చూడుము. నాకింకేమియు అవసరములేదు. నేను నీతో ఎప్పుడుండ గల్గుదునోయని కలవర పడుచున్నాను.

నీ ప్రియుడు,

హా ర.



# లేఖ 21.

నాతల్లీ! (టుండ్లాలోని)

నీ లేఖ చదువుటచే నాకు చాల విచారము గల్గినది. ఏమి తల్లీ! నిన్ను నీవే ఎటుల మరచితివి? కృష్ణుడుండగా "కొడుకు లేక భర్త లేక" అని యెందుకు వ్రాసెదవు. ప్రభుని నామమును జపింపుము. తిరిగి ఎట్టి నష్టమువలనగాని నీవు దుఃఖింప నవసరము లేదు. ఆ భర్త ఎన్నడును చనిపోడు. ఆ 'కుమారుడు' తల్లి అంకమును విడనాడడు. అట్టి "తల్లి తండ్రులు" వారి అంకము నుండి నిన్ను ఎన్నడును క్రిందకు త్రోయరు. తల్లీ! అపుడు నీవు దేనినిగూర్చి విచారింప వలసి వచ్చును? బొమ్మరింటిలో ఒక బొమ్మ పగిలినపుడు యేల విచారింపవలెను? ఆయాట కొద్ది రోజులవరకే. సర్వప్రియుడైన కృష్ణుని నీ సర్వస్వముగ ఆచంచల మనసుతో ప్రేమింపుము. నీ సమస్త కోరికలును నెరవేరును. మరియు నీవు ఘనమైన ఆనందములో నుండగలవు. అందువలన నీవు విచారింపవద్దు. తల్లీ! హరి నామస్మరణ చేయుచు నీవు యీ జీవితమున ఆనందముగ నుండెదవని నా కోరిక. అటుల జరుగుటకే కృపామయుని నేను ప్రార్థించుచున్నాను. తల్లీ సర్వమును మరచి కృష్ణ ప్రేమతో పిచ్చి దానవు కమ్ము. అది చూచి నేను విశ్రాంతిని పొంది సంతోషింతును. దయార్ద్ర నేత్రములతో నన్ను చూచుట మరువ వద్దని నీతల్లికి చెప్పవలెను. నీతోకూడ ఆమె ఆనందముగ నుండవలెననియె నాయొక్క కోరిక.

నీ,

హరుడు.

# లేఖ 22.

ప్రియమైన తండ్రీ, దీనూ!

నీ ప్రేమమయమైన లేఖ నిరాశా పూరిత హృదయము లోకూడ ఆశను కల్గించును. నీవే అంతపవిత్రుడవు కాకపోయి నచో అట్టి రత్నములవంటి కుమారులను పొందగలవా? కొడు కులే తండ్రి యొక్క సుగుణములను చాటగలుగుదురు. ఈ గాజు తునకను ఆరత్నాలలో ఒకదానిగా పరిగణించినచో నేను తృప్తిపడుదును. దయయుంచి నా ఆపేక్షలను భగ్నముచేయ వద్దు! తండ్రీ! యీ ప్రాపంచిక సంబంధమైన పనులు యిక్కడ నే ఉండిపోవును. తదనుగుణముగ, అట్టి ప్రాపంచిక పనులను మరిచి, నీతోడుగ వచ్చి, నీకు శ్రేయోదాయకమగు నిజమైన పనినిచేయుట నీ కర్తవ్యముగాదా? ఈ ప్రాపంచిక ధర్మములను ప్రక్కకుంచి, భగవన్నామము స్మరించుట తెలివైన పని "సదా కృష్ణుని యొక్క దాసులమనే విషయము మరిచి, జీవులు, మోస కారియైన మాయాదేవి చేతులలో (అజ్ఞానములో) పడి కంఠ మునకు ఉరితెచ్చుకొందురు." నిదురపోవు చున్ననూ, మెలకు వగా ఉన్ననూ, దీనిని జ్ఞాపకముంచుకొనుము. కృష్ణునీ, ఆతని నామమునూ, జీవన్మరణముల మధ్యమరువవద్దు. శ్రీకృష్ణ నామము తప్ప, మిగిలిన సర్వస్వమూ మిథ్య. ఈ ఖేలను అనాది కాలమునుండి ఆడుచునే ఉన్నావు. కాని ఎన్నడైననూ తృప్తిని పొందితివా? దానికి తృప్తిలేదు. మురికిని మురికి చేత కడుగలేము. మురికిని కడుగుటకు నీరుకావలెను. నీరు

కొరకు యత్నముచేయుట యుక్తముకాదా? ఆ పవిత్రమైన (యీప్రాపంచిక మురికిని శుభ్రముచేయగలిగిన) నీరు, ఒక్క కృష్ణ నామమే నని తప్పక తెలుసుకొనుము. అందుచేత ఆ నీటిలో సదామునిగి యుండుము. మురికి నిన్ను అంటజాలదు. కృష్ణనామమునే ఆశ్రయముగా చేసుకొన్నచో, పవిత్రమైన, పావన కరమైన స్థితిలో ఉండగలుగుదువు. మురికి నిన్ను పట్టజాలదు. అందుచేత భగవద్గీతలో "ఎవరు నన్ను పూజింతురో వారందరూ, యీ మాయను దాటగలుగుదురు," అని చెప్పబడినది. అందుచేత సదా కృష్ణనామమునే శరణు పొందుము. భయ రహితుడవై, ఎక్కడైననూ, నిర్భయముగ ఉండగలుగుదువు. తండ్రీ అమ్మను తన కుమారునిపై దయగలిగి యుండమని కోరుము. నాకు యింకేమీ అక్కరలేదు. మీ వంటి తలి తండ్రులను పొందితిని కనుక నారోజులన్నియు ఆనందముతో గడుప గల్గుదును గాక! నాకు కాళ్లు చేతులులేవు. అందుచేత మీమీదనే ఆధారపడు చున్నాను. మనము కలుసుకునే ఒక్క అవకాశము కలుగ జేయుము. అదే నాకోరిక.

నీపై ఆధార పడిన,

హారుడు.



# లేఖ 23.

అత్యంత ప్రియమైన సోదరీ,

నీమధుర లేఖ అందినది. మీరందరూ ఒక్క గుంపుగా నన్ను చూచుటకు వచ్చినట్లున్న దే! నాతల్లి, నీచెల్లెలు, మీ రందరూ నాకు సమానముగ ప్రియులు. అందుచేత ఏ మాణిక్య మును ముందుగా అంగీకరించవలెనో తెనుసుకొన జాలకుంటిని. ఏమైననూ, నీవేగెలిచితివి. నీచెల్లెలు ఆఖరుగా వచ్చినది. నీ లేఖ యేడెనిమిది సార్లు చదివిన తరువాత ఆమె లేఖను చిదివితిని. దీనిని బట్టి నిన్నెంతగా ప్రేమించు చుంటినో తెలుసుకొన గల్గుదువు. నీవు నా మీదనే ఆధారపడుచున్నా వన్న ఒక వింత భావమును తెలుసుకొని నవ్వు పట్టజాలక పోతిని. నిజమేమనగా నేనే మీ పై ఆధారపడి యున్నాను. మీరందరూ నాశరణ్యామన్న సత్యము, ప్రస్తుతమేగాదు, ప్రపంచమున్నంత వరకు వ ర్తించును. ఈవిషయమును గూర్చి ఎక్కువగ వాదింప వలసిన పనిలేదు. కృష్ణుడు తనంతట తానే మిమ్ములను గురువుగా అంగీకరించినచో యితరుల గూర్చి చెప్ప నవసర మేమున్నది? నేనసత్యమును చెప్పుచున్నానని తలుపకుము. నామనస్సులో యీ భావములు ఉద్భవించె ననుకొనవద్దు. వేదములు, తంత్రములు, పురాణ ములు, మంత్రములు, యిదేసత్యమును చాటుచున్నవి. బృందా వనములోని ఒకచిన్న గాధను నీకు యిప్పుడు తెలియ జేతును.

ఒకనాడు బృందాదేవి వచ్చు నప్పుడు శ్రీమతి రాధా దేవి ఆమె నిట్లడిగెను. "బృందా! ఎక్కడనుండి వచ్చు

చున్నావు?" అందుకామె "నేను హరిచరణ సన్నిధి నుండి వచ్చుచున్నాను" అప్పుడు శ్రీమతి (రాధ) తిరిగి యిట్లు ప్రశ్నించెను. "ఆయన ఎక్కడున్నాడు? ఏమిచేయుచున్నాడు?" అందులకు బృందాదేవి "రాధా కుంజీలో అతడు నాట్యపాఠములు నేర్చుకొనుచున్నాడు!" అని తెల్పిన సమాధానము శ్రీమతిని చాల ఆశ్చర్యపరచినది. అందులకు శ్రీమతి "ఆశ్చర్యము; బృందా! నేను యిక్కడ నుండగా అతనికి గురువు లెక్కడ దొరికిరి?" అని ప్రశ్నించెను. అందులకు బృంద "నీయొక్క రూపము ప్రతి వృక్షము లందును, లతల యందును ఆవిర్భవించి నటరాజైన కృష్ణునకు నాట్యపాఠములు నేర్పుచున్నవి. కృష్ణుడు కూడ దానిని అనుసరించి నాట్యము చేయుచున్నాడు," అని చెప్పెను. సోదరీ! నీవు ఎవరివో నీ శక్తి ఎంత గొప్పదో యిప్పుడు నీవు గుర్తించెదవు. శ్రీమతిని ప్రతి స్త్రీకి పోల్చరాదని నీవు అభ్యంతర పెట్టవచ్చును. కాని నావాదమును ధృఢపరచుటకు కృష్ణుడు తనంతట తానే తన పవిత్రముఖమునుండి యేమి తెలియ జేసెనో నీకు యిప్పుడు వర్ణించెదను. అది తప్పక నాయందు నమ్మకము కల్గించి, నీ తెలివిహీనుడైన సోదరుడు అసత్యము పలుకలేదని ఒప్పుకొనెదవు. కృష్ణుడు యీవిధముగా చెప్పెను:—

ఈ ప్రపంచమునందలి ప్రతి స్త్రీ యందును నా మనస్సు భక్తిని కల్గియున్నది. నీవు ప్రపంచమునకు ఆవల లేవు కదా! పైగా మావలె దురభిమానముతో మీరు బాధపడరు. స్త్రీ

జాతియొక్క రూపములు యీ ప్రపంచమును, తరువాత ప్రపంచమును అలంకరించు ఆభరణముల వంటివి. సోదరీ! నేను తరించుటకు సహాయము చేతువా? లేక నేను నీకు సహాయము చేసెదనా? చెప్పుము. సోదరీ! మీరు "భవ జలధిలో మాకు జీవన నౌక వంటివారు." ఎన్నడూ నీ కృపా కటాక్షమునుండి జార కుందునుగాక! దాటుటకు మూల్యము నే నివ్వలేనని నీ యను గ్రహము తీసివేయవద్దు. ప్రియసోదరీ! ఈ జీవితములోగాని మరొక జీవితములోగాని నిన్నెడును మరువలేను. దయ యుంచి నీవు కూడా నన్ను మరువవద్దు. నీ సంపూర్ణ హృదయమును నీ మనుమనికి అర్పించుము. అందులో నాకు కుతూహలములేదు. కాని నీ హృదయేశ్వరుని సన్నిధిని కొంచెము ఆశ్రయము నాకు ప్రసాదించుటకై ప్రార్థించుము. ఆ పవిత్రస్థలములో ఒక నమ్రత కల్గిన వ్యక్తిగా వసించుటకు అర్హత నాకివ్వబడినచో అత్యంత అదృష్టవంతునిగా నన్ను నేను పరిగణింతును. నాకు యింకొక ప్రార్థనలేదు. ప్రియమైన సోదరీ. కాళీ విగ్రహమును చూచినంతనే నీకు తృప్తి కలుగకపోవుట నీ తప్పుకాదు. ఒక స్త్రీ తనయొక్కగాని, తన భర్తయొక్కగాని, తల్లి తండ్రులను కలసి కొన్నప్పుడు, తన ప్రియుని కలుసుకొన్నప్పుడు, పొందునట్టి ఆనందమును పొందునా? భర్తవలన ఆనందము పొందనట్టి స్త్రీలే తలితండ్రులవద్ద ఆనందించెదరు. ఇపుడు నీవు జగన్నాధునకు, మణివంటి కృష్ణునకు అర్పింపబడి, అతడు యెట్టి వాడో గుర్తించితివి. అందు చేతనే తల్లిని చూచినంతనే నీవు సంతోషించలేదు. నీ వింకనూ నీ నాధుని ప్రేమలో ఎక్కువ

లోతుగా మునిగెదవని ప్రార్థించుచున్నాను. కాని, సోదరీ, నీవు జాగ్రత్తతో నుండవలెను. నాథుడు, ప్రేమ చేష్టల మధ్య నొకప్పుడు నిరాదరణకూడ నుండును. జాగ్రత్త. తన ప్రకాశవంతమైన కాంతిని చూపి, చంపుటకే క్రిమిని ఆకర్షించిన అగ్నివలె, కృష్ణుడుకూడ ప్రతివానిని మొదట తన కళల చేత ఆకర్షించి, చివరకు దుఃఖసాగరమున త్రోయును. అందుచేత ప్రియసోదరీ, ఎప్పుడైననూ, నాథునితో మనస్పర్దలు కలిగినచో, నిరాశ చెందవద్దు. ఇంకొక విషయముగూర్చి హెచ్చరించు చున్నాను. ఎచ్చటనైనను తనభర్తను ప్రేమింపని స్త్రీ యున్నదా ? కాని ఏ స్త్రీయైననూ హృదయమున దాచవలసిన ప్రేమను ప్రదర్శింప యత్నించినచో, యితరులయొక్క వేళాకోళమునకు గురియగును. అదేవిధముగ కృష్ణుని యందలి నీ ప్రేమను నీ హృదయ ధనాగారముగా నుంచుకొని, ఎప్పుడూ తెలియజేయకూడదు. ఆ ధనాగారము దేనికి చెందినదో అచ్చటనే, అనగా హృదయమునందే ఉంచుము. ఏక్షణమందైనను, నీ ఉత్సాహామును ఆపుచేయజాలక పోయినచో, ప్రశాంతమైన ఏకాంతస్థలమునకు పోయి, నీ భావములను పొంగనిమ్ము. ఆ స్థితిలోకూడ నీ యింటి పనులను మరువవద్దు. అతనిని కాని అతని నామమును గాని మరువ వలదు. నీ మనో ఆత్మలచేత 'అతని' యొక్క వ్యక్తిగా మారుటకు యత్నింపుము. అతని వ్యక్తివైనచో ఎవ్వరూకూడ నిన్ను ఆజ్ఞాపింపజాలరు. నీవు శాశ్వతానందమును పొందగలవు. "హాత్రస్" లోని సోదరీ, చాందీదాసు యొక్క "రాజా కిని రాయ్" (రాజుకి రాణి), ఆమె కథ పూర్తిగా భిన్నమైనది. ఆమె

ఎటువంటిదో నని నన్ను నీ వడిగినచో, అత్యంత గౌరవనీయుడైన చాందీదాసుని వచనము లిక్కడ వ్రాయుటకంటె వేరే నేను చేయగల్గినది లేదు:—"ఓ రసమయీ, చండీదాసు చెప్పునది వినుము. నీవు నిజముగ ఒక రసకూపమే" నీ హ్యాత్రస్ సోదరి, "ఆమెకు ఆమెయే సాటి" ఆమె నాయొక్క ప్రియమైన 'శారీమా'. రహస్యముగా సేవచేయు విధానము ఆమెకు తెలియును. ఆమె యొక్క ప్రేమచేత, రసికోత్తముడైన నటవరుడు (కృష్ణుడు) ఆమెయొక్క చేతులలో ఒకమట్టి బొమ్మయే. ఆమె మనుమని భార్యవైన నిన్ను గురించి నేనేమి చెప్పగలను? "ఆతనిని" (కృష్ణుని) నీ వ్రేలు క్రిందికి నీవు తెచ్చుకొంటివి. దయయుంచి, ఆ చమత్కారమైన సర్వజన ప్రియుడు నన్ను మోసపుచ్చ కుండగా నన్ను రక్షించుము. నీ గుమ్మము ముందర స్థిరముగా కూర్చుని యుందును. నన్ను త్రోసివేసినను నేను కదలను. నీ సోనాముఖి చెల్లెలు నిజముగ పిచ్చి పట్టిన దాని వలెనున్నది. ఆమె గురించి నాకేమియు తెలియదు. ఆమెకు ఆమెయే ప్రభువు. నేను ఆమెపై ఆధారపడిన వారిలో ఒకరికంటె ఎక్కువకాదు. ఆమెయొక్క ఆటలు, ఆమె చేతను, నాహ్యాత్రస్ సోదరిచేతనూ కూడ తెలుసుకొనబడును. వారి మధ్య ఎట్టి మనోతరంగములు కలవో, వారెట్టి ఆలోచనలలోనుందురో, నాకు ఊహింప శక్యముకాదు. నీ 'దీదీమణి' క్షేమముగానున్నది. ఆమె వద్ద నుండి యీనాడే ఒక లేఖ పొందితిని. సైనికాధి కారిగ (Commanding Officer.) ఆమె రష్యనుల నెదుర్కొనుటకు సన్నాహములు జరుపుచున్నదని తెలుసుకొంటిని. ఆమె క్షేమముగ

నున్నది. ఆమె యెట్టి ఆట ఆడనున్నదో ఆమెకే తెలియును. నేను తెలుసుకొన గలుగు మేర యందులేదు. నావంటి వారే మీరు ఆమె ఆటను తెలుసుకొనగలరు. స్వర్గమునకు ఎత్తి, తిరిగి, యింకొక క్షణమున మమ్ములను నరక కూపమునకు త్రోసి వేయుదురు. నావికులవలె, ఎవ్వరికిని తెలియని సముద్రముల లోనికి మమ్ములను తీసుకొనిపోదురు. మీరే తలచుకొన్న-చో మమ్ములను అగాధ జలధిలో ముంచుచుందురు. ఆ వినోదమును ఆనందించెదరు. మీ వినోద పూరిత ఆట శ్లాఘనీయము. నీ దర్శన మాత్రము చేతనే నేను భయముచేత కృంగు చున్నాను. నాయందు కృపగలిగియుండుము. నాయందు సుగుణము లేవియు లేవు. నా ఆశలు, కోరికలన్నియూ, నీ యందే యున్నవి. నీ క్షేమమును గూర్చి ప్రతి లేఖలో, నీ చెల్లెలు అడుగుచునే యున్నది. ఇప్పటివరకు ఆమె క్షేమముగనున్నది. ఆమె తండ్రి గారి యిల్లు సోనాముఖిలోనున్నది. ఆమెయొక్క, చెల్లెళ్ళు, సోదరులు, అక్కడనే యుండెదరు. మాయింటివద్ద, నన్ను గన్న ప్రేమపూరితమైన తల్లియున్నది. మా పెద్ద అన్నయ్యకూడ అక్కడనే యున్నాడు. మనందరకుపైన భగవానుడున్నాడు. నన్నుగూర్చి తెలుసుకొనవలసిన దంతయూ, చెప్పితిని. నా 13-వ సంవత్సరమునుండి, 25-వ సంవత్సరమువరకు కలకత్తాలో నుంటిని. ప్రస్తుతము నా రోజులను యీ హిమాలయపర్వతములలో గడుపు చున్నాను. ఈవన వాసములో నారోజులు దుర్భరముగా నున్నవి. కృష్ణునియిచ్ఛ నెరవేరుగాక! ఆతని కేది తృప్తికలుగజేయునో, నాకునూ అదేతృప్తి కలుగజేయును. ఇట్టి నిరుత్సాహ సమయ

ములో, నీ లేఖలు గొప్ప విశ్రాంతిని కలుగజేసి, ఒకొక్కప్పుడు గొప్ప ఆనందములోనన్ను ముంచివేసి నన్ను ఒడలు మరచునట్లు చేయును. నీ చిన్నతమ్ముడు యిక్కడ యింకొక సోదరుని పొందగలిగినాడు. ఆ సోదరుడు నిన్ను చూడక ముందే ప్రేమించు చున్నాడు. ఆతడు నీకు సోదరుడై, తన ఆశీస్సులను పంపు చున్నాడు. తల్లికి నావందనములు. బిడ్డలకు నా ప్రేమ నందజేయుము. మనుమనికి నా ప్రేమను అందజేయుము. అతడె నీకును నాకును ప్రియమైన వారిలోకెల్ల ప్రియతముడు. ఆతని క్షేమ సమాచారమును తెలియజేసి నన్ను ఆనందింపజేయుము. కృష్ణుని కొక్కనికే యీ శెలవుసంగతి తెలియును. నాకేమియు తెలియదు. నేను రక్షింపబడినచో నిన్ను తప్పక కలుసుకొందును. కృష్ణుడు నీ కోర్కెను సఫలము చేయుగాక! అందు కించెత్తయినను సందేహములేదు. పవిత్ర బృందావనములో, గంగానదియొడ్డున మనము కలుసుకొనుట అత్యుత్తమము. ఈ కోరిక కృష్ణుడు సఫలము చేయును. నీవు, నేను, సుక, శారీ, అందురూ అంతులేని ఆనందమున మునిగి పోయెదము. కృష్ణుడట్టి దినము ప్రసాదించునో లేదో నని ఆశ్చర్య పడుచున్నాను. నేను అతి పిచ్చి వాడను. నేను చెప్పుదానికి నన్ను నిందింపవద్దు. నేనొక అనాగరికుడను. అందుచే భయపడవద్దు. మనుమనకి, నీకును నా ప్రేమ నందజేయుచున్నాను. ఇపుడు నీ యనుమతితో శెలవు తీసుకొందును. నన్ను జ్ఞాపక ముంచు కొనుము.

నీ,

హార.

# లేఖ 24.

ప్రియసోదరా! గోపీన్,

నీ లేఖ బహుమధురముగ నున్నది. ఈ పాత బడిన సోద రుని మరువకుము. అప్పుడప్పుడతనిని జ్ఞప్తికి తెచ్చుకొను చుండుము. ప్రియసోదరా, మీ క్షేమము వినినంతనే స్వర్గమును పొందినంత సంతోషమును పొందెదను. కృష్ణుని యందలి నీభక్తి, ఘనమగుస్థానమును పొందువరకు దిన దినాభి వృద్ధి చెందునుగాక! అదియే నా కోరిక. అదియే కృపామయునకు నా తీవ్రమైన ప్రార్థన.

సోదరా, మనము నటించ దలచుకొనిన నాటకములో మన పాత్రలు ఆఖరగునంతనే తెరవెనుకకు మరలి, తిరిగి క్రొత్త దుస్తులతో వచ్చెదము. దీనినే అజ్ఞానములో జీవన్మరణములని పిలచి, భయపడుచుందుము. ఈ తప్పు భయము, మన మనస్సులను పట్టకుండగా ప్రభువు రక్షించుగాక! ఆతని ఆజ్ఞను శిరసావహించుచు, యీ 'ఆగమన నిష్క్రమణ'లను చిరునగవు గల మోముతో చేయుదుముగాక! అతని స్వజనులలో ఒక్కరిగా ప్రతీజన్మ జన్మాంతములందును తిరిగి వచ్చెదముగాక!

సోదరా, "పల్లివాసి" (ఒకపత్రిక) ని ఒక్కసారి చూచితి వని తెలుసుకొని సంతోషించితిని. నీ జాగ్రత్త యత్నముల వల్ల "పల్లివాసి" ప్రతిగృహమందును స్థానమును పొందు గాక! ప్రభువు నీకార్యమున తోడ్పడుగాక! సోదరా, నీ యీపురాతన

సోదరుని తరుచుగా జ్ఞాపకము తెచ్చుకొను చుండుము. ఆఖరి కుఱ్ఱవాడు యీనాడు కృష్ణుని కృపచే స్నానము చేసినాడు. మేము క్షేమముగ నున్నాము. కాని శరీర విషయము చూచిన, యిది యొక భౌతిక కళేబరము గనుక, యేదియో ఒకటి సామాన్యముగ జరుగుచునే యుండును. అందులకై, నీవెంత మాత్రము విచారించవద్దు. పైగా మన మిక్కడ మన పాత్రలు అనేక రాత్రులందు అభినయించుచు చాలకాలముంటిమి. మన కిప్పుడు కొంత విశ్రాంతి అవసరము. మననేత్రములు బరువెక్కినవి. మనము నిద్రంపవలెను. నీ శక్తులను కూడ బెట్టుకొని నీ విప్పుడు నాటక రంగమునందు కనుపించతివి. ప్రభువు కోరినట్లుగా ఆతని కృప చేతనే నీపాతను అభినయించి అతనిని తృప్తి చేయుదువుగాక! ఒక పెద్దపాత్రను తీసుకొని అతని స్వజనము క్రిందనే పరిగణింపబడుము. ఆరోగ్యమగు శరీరముతో ప్రభుని కార్యములు చేయగలవని నేను కోరుచున్నాను.

నిత్యానందుని మరువ వద్దు. ప్రియమైన సోదరా, నిత్యానందుని మరచినను, గమ్యస్థానమును జనులు చేరుట నిజమే అయినను, మార్గము మాత్రము నిరుత్సాహముగ హెచ్చు తగ్గులుగ భయపూరితమైయుండును. అందుచేత నిత్యానందుని యొక్క చరణములు విడువ వద్దని కోరుచున్నాను. జనులు వారికిష్టము వచ్చినట్లు చెప్పనీ; నీకు చెప్పబడిన ప్రతి దానిని వినుము. కాని నీ జీవితమును, ఆత్మను నిత్యానందుని చరణముల వద్ద కట్టియుంచుము. 'అతడు' మినహా (విన) యింకొక

దయామయుడు లేడు. గౌరు నిత్యానందుల ప్రసన్న వదనములను తిలకించుము. మరియు ప్రతిదినము చరణామృతము త్రాగుము. ఇది నీకోర్కెలను సఫలము చేయును. సుఖ దుఃఖములలో నిత్యానందుని నీవానిగనే పరిగణింపుము, కేవలము, ఈ శరిరమును పోషించి పెంచుటకై నీబాంధవ్యమును త్రెంచవద్దు. ఈ శరీరము యేదో ఒకదినము నశించును. కాని మచ్ఛమాత్ర ముండిపోవును. అందుచేత పతివ్రతా శిరోమణివలె నిత్యానందుని చరణములందు శరణుపొందుము. ఈవిషయమును వాదించుటకు యత్నము చేయవద్దు. ఎవరైనను, ఈ విషయము వాదించుటకు వచ్చినచో, ఆ స్థలము వదలి వేయుము, లేక అజ్ఞానము నటించుము. నీకు సంతోషము కావలసి వచ్చినచో, నీవు ప్రేమలో తేల దలచు కొన్నచో యీ జగత్తును నడపు వానిని నీవానినిగ చేసుకొన దలచు కున్నచో, నా నిత్యానందుని వద్ద సంపూర్ణ శరణు పొంద వలెననియే నా అఖరి మాట. నీ గౌరవ పూర్వకమైన తండ్రికి నావందనములు. మీకందరకు నా ప్రేమాను రాగములు. మిమ్ములనందరను ప్రభువు ఆనందమున నుంచుగాక! నాప్రేమను తండ్రి ప్రకాశ్ న కందజేయుము. అతనిని గూర్చి వ్రాయుము.

నీ సోదరుడు,

హర.



# లేఖ 25.

నా ప్రియమైన తండ్రీ,

(పూర్ణ బాబు)

నీ లేఖ వలన నీవన్ని విధముల కుశలముగ నున్నావని తెలుసుకొని చాల సంతసించితిని. తండ్రీ, కృష్ణనామము జపించుటకు యేదీరాజమార్గములేదు. ఏదైన ఒక రూపములో జపించుట చాలును. నామము చేసిన కొలది, అన్ని మార్గములు, ఉపాయములు వ్యక్తములగును. ఇందు ప్రశ్నింప వలసిన దేదియు లేదు. తండ్రీ, నామము చేయునపుడు కృష్ణ స్వరూపము హృదయములో వెలయుటలేదని విచారింపకుము. 'అతని' నివాసస్థలమును 'అతడే' నిర్మించు కొనును. 'అతని' విశ్వ రూపమును, క్షుద్రమైన సంకుచితమైన మానవ హృదయముల వంటిస్థలమున నుంచ యత్నించుట అంత ఆనంద కరమగు పని కాదు. ఏలనన, అది అతని కనుగుణముగ నుండక పోవచ్చును. హృదయము నిజముగ విశాలమైనచో, ఆతడు తనంత తానే దానిని ఆస్థానముగ జేసుకొనును. దురభిమానముచేత మోసపోయి, మన హృదయములను అపవిత్రముగా నుంచితిమి. అందు చేతనే, మనమనస్సు భ్రమించి విశ్రాంతి స్థానమును పొంద జాలకున్నది. పొరపాటున మనము అల్పగృహిణులని ఎవరిని పిలచెదమో, వారు తమ సాధారణ ధర్మములను నిర్వర్తించుచు, వారి హృదయములను విశాలము చేసి, పట్ట శక్యముకాని

వానిని పట్టుటలో ఉత్తీర్ణులైరి. వారినిజమైన నమ్మికయే ఈ పురోగమనమునకు కారణము. పంచపాండవులు కృష్ణునకు ప్రియులు. కాని ద్రౌపది జీవతము ప్రియతమమైనది. తనంత తానే యీ విధముగ చెప్పెను. "ప్రజవాసులైన సర్వులు, నా తల్లి తండ్రులు, స్నేహితులు నాకు జీవితమువలె ప్రియులే. వీరందరిలోనూ గోపికలు నా జీవితమే. అందులో నీవు (రాధ) నాప్రాణమునకు ప్రాణము." శ్రీమతికి యీమాటలు చెప్పుట లో యిదేలక్ష్యమున్నది. పట్ట శక్యముగాని వానిని పట్టు శక్తి స్త్రీలకు గలదు. అందుచేత వారినెన్నడునూ తూలనాడ కూడదు. నాప్రియమైన తల్లి ఉపవాసముల చేత క్షేమముగ నున్నదని తెలుసుకొని యీకొద్ది వాక్యములు చెప్పుటకుచొరవ చేసితిని. నేనట్లు చేసినందుకు క్షమించి, నా వందనములు ప్రియమైన తల్లికి అందజేయుము. ఆమె సుగుణముల చేతనే నీవు వృద్ధికి వచ్చితివని తెలుసుకొనవలెను.

తండ్రీ, కృష్ణనామము ప్రణవమునకు కూడ అతీతమైనది. దాని ముందు గాని వెనుకగాని ప్రణవమునుంచ నవసరములేదు. వేదములసారమే ప్రణవము. కాని కృష్ణనామము వేదాతీతము. ఈ విషయము గూర్చి ఎక్కువ వ్రాయజాలను. కాని నేను విన్నవించుటకు చొరవ చేసుకొనుచున్నదంతయూ, యేమన ఒకవేళ ప్రణవ మవసరమైనచో, ప్రణవముతో కూడిన నామమునే, అతడు గౌరాంగ రూపముతో అవతరించి నపుడు, వ్యాపింప జేసి యుండెడి వాడు. శూద్రుల స్పర్శచేత ప్రణవము పవిత్ర తను పోగొట్టుకొనవచ్చును. కాని కృష్ణనామము చండాలుని

కూడ పవిత్రము చేయును. ఇంతకన్న చిన్న ఉదాహరణ నేనే మీాయగలను? నాపిచ్చి దనమును మన్నింపుము. పిచ్చి వాని మాటలచేత మోసపోవద్దు. నీ ప్రేమవలననే చనువు తీసుకొను చొరవచేయుదును.

నీ ప్రియ,

హార.

# లేఖ 26.

ప్రియమైన తండ్రీ,

(శ్రీయుత మోహినీ మోహన్‌ధర్, దివాన్, మయూర్ భంజ్)

చాల కాలమునుండి నీవద్దనుండి లేఖలు రాకపోవుట, దయ గల తల్లి, ప్రేమించే తండ్రీ తమ బీద బిడ్డకు లేఖలు వ్రాయక పోయినను మరువరని నన్ను నమ్మించు చున్నది. తండ్రీ, నీవు యిక్కడకు వచ్చి నావంటి దరిద్రులపై కృప చూపుటకై పెద్ద స్థానములను ఆక్రమింతువు. అందుచేతనే ప్రభువు నీ కొరకై చాల ముఖ్యమైన పాత్రను నియ మించెను. మీారు ప్రభుని కిష్ట జనులు. అతని యొక్క ఆప్త కోటికి చెందినవారు. ప్రస్తుతము నీ యొక్క పిచ్చికుమారుని నీవు అడిగిన ప్రశ్న చూడుము. అది ముక్కోపి వద్ద అణకువను గూర్చిన పాఠములను నేర్చుకొన యత్నించు నటులున్నది. అమూల్య మైన కృష్ణప్రేమ నానుండి, బహుదూరముగ నున్నది. దుష్ట

చర్యల ఉద్యోగము తొలగినంతనే గొప్ప పశ్చాత్తాపము జనించునని నేననుకొను చున్నాను. అటులనే సాధారణ ప్రాపంచిక విషయముల ఉద్వేగము తొలగినంతనే ఉత్తమ జీవితమును గూర్చిన భావములు ఎక్కువగ మనస్సును కదలించును. అపుడు మానవులు సర్వమును మరచి మనస్సున అత్యంత ఆతురతతో మార్గము కొరకు వెదకుచుందురు. మార్గము దొరకి నంతనే ప్రశాంతత పొందుదురు. తండ్రీ ఆసొత్తు యీ ప్రపంచమునందలి ఎట్టి ధనమునకు బదులుగా గాని పొందజాలము. ఎవ్వరాధనమును కల్గియుందురో వారీ ప్రాపంచిక ధనమును ఆశించరు. కడుపు నింపుటకైననూ వారికి సరిపడు ఆహారముండదు. వారిని కప్పుటకై మొల బట్ట కూడ వారికి లేదు. ఈ లేమికి వారెన్నడును చింతించలేదు. వారి దినములును అనవరతానందమున గడుపు చుందురు. తండ్రీ, మనప్రభుని ధనాగారమున మణులు కుప్పలు కుప్పలుగా పోయబడి యున్నవి. (ఎవనికెంత కావలయునో అంతమాత్రమే పొందగలడు) ఎవ్వరునూ తిరస్కరింపబడలేదు. ఒక్కసారి హృదయములో కోరి నంతనే, ప్రేమ రుచి పొంది నీవు తృప్తి చేయ బడుదువు. నేను మిక్కిలి బీదవాడిని, తండ్రీ, నేనేమియు యివ్వలేను.

నా సోదరు లిద్దరూ యెట్లున్నారో తెలియజేయుము. నీకు నా ప్రేమను అంద జేయుచున్నాను. తండ్రి, హాటాత్తుగా

యీ నాడు నేను చిరాకు పొందితిని. దానికి నేను కారణము చెప్పలేను. శరీరము అనేకము లైన వాటిని అనుభ వించవలెనని తెలుసుకొన్నాము. వాటి ఆనందమును నన్ను అనుభవింపనిమ్ము.

నీవు సుఖముగ నున్నావని తెలుసుకొని సంతోషించితిని. దానిని దినదినమూ ప్రభువు వృద్ధి పొందించుగాక ! కటక్ నుండి శ్రీమాన్ గిరీష్ తిరిగి వచ్చెనా? అతడు ఎట్లున్నాడు?

నీ ప్రియ,

హార.

## లేఖ 27.

ప్రియమైన తండ్రీ,

(శ్రీయుత శ్యామ చరణ చక్రవర్తి, చింసూరా)

ఈ నాడు వచ్చిన నీలేఖ నాకు చాల ఆనందమును కలుగ జేసినది. అటుల కానిచో, నీవు నాతండ్రిగా యెటులయ్యెదవు? తండ్రీ, నీవు అగాధమైన జలధివని, మేము అందలి చిన్న చేపల మనియు నేను తెలుసుకొని యున్నాను. నాకు కొద్ది సంతోషముండెను. కాని అది తగ్గినది. నీ లేఖ వల్ల తండ్రి యైన 'గోస్తా' యొక్క మరణ వార్త తెలుసుకొని విచారించితిని. ఒక విధముగ అనేక పీడల యొక్క బంధనమునుండి విముక్తి

పొందెను. ఆరాధన కుపయుక్తమైన శరీరముతో తిరిగి వచ్చి ఆనందముతో ప్రభుని నామము జపించును. కృష్ణనామమును పెదవులపై నుంచుకొని చనిపోయినప్పుడు అతని నామమును జపించుటకే తిరిగి వచ్చును. ఈ విధముగ క్రమ క్రమేణ పురోగమించుచు ఒకనాడు కృష్ణుని యొక్క సహచరులలో చేర్చబడును. ఇదే న్యాయము - యిదేమార్గము. తండ్రీ, కాలము ఒక పత్రము వంటిది, (జీవుల) కార్యములు అందులిఖింప బడిన ఆటలలోని భాగములు. మనము ఆటగాండ్రము. ఆ పత్రమునందు లిఖింప బడినంత వరకే సరిగా ప్రతి వక్కరు ఆడ వలసియుండును. తదనంతరము యింకొక చోటుకు వెళ్లి ఆడుటకు ప్రతి ఒక్కరికిని స్వేచ్ఛ గలదు. సర్వాంతర్యామియైన, నాప్రభువు అధికారిగా యీ ఆటను వినోదకరము చేయుచున్నాడు. అందుచే ఆనందము ఎన్నటికిని తగ్గదు. అది సహా ఆనందముగా, ఆకర్షణీయముగా నుండును. అట్టి యుక్తమైన విభజనచేత సంపూర్ణమైన సంతోషమును కాని, సంపూర్ణమైన దుఃఖమునుగాని, ఎవ్వరును పొందుటలేదు. ఎవరు యీ క్రీడనుండి విముక్తులై, ప్రభుని వద్ద సహాయము కోరకుండెదరో, వారికి బాధకరమైన సూర్య రశ్మిగాని, శీతల ఛాయగాని లేదు. సదా ఆనందములో ఉండెదరు. వారందరును తరించి యుండుటచే, భద్రమైన పర్వ తాగ్రమునందు కూర్చుని, ఒకప్పుడు తీవ్రమైన తుఫాను వలన మునిగిపోవుచు, ఒకప్పుడు దాటు చున్నట్టి, జలధిలోని ఓడలను పరిశీలించు చుందురు. ఈ పడవల యొక్క మునుకలతోను, రక్షణలతోను వారికి

సంబంధము లేదు. నిత్యానందుని యొక్క భద్రమైన సన్నిధిని కూర్చుని యీ పడవ మునకలను పరిశీలింపవలెనని నా ప్రార్థన. పర్వత శిఖరమున కూర్చుని సముద్రమునందలి తుఫానును పరిశీలించుట అద్భుతమైన దృశ్యము. నిత్యానందుని చరణము లందు ధృఢమైన రక్షణ పొందుము. తండ్రీ, పిచ్చివానివలె నేను పల్కు సంబంధ రహిత వాక్యములను లెక్క చేయవద్దు. తండ్రియైన 'భాగవత్' ఆరోగ్యము పొందినపుడు నాకు కూడ శక్తి వచ్చును. ఈ శరీరము మీ కొరకే. మీరే ఈ శరీరములోని ప్రాణము. అందుచేత మీరు క్షేమముగ నున్నచో నామనో కాయములు పరస్పరము అనుగుణములై యుండును. అందు వలననే మీరు సదా ఆనందముగా నుండవలెనని ప్రభుని ప్రార్థించుచుందును. అప్పుడే నేను కూడ ఆనందముతో నుండగలను.

నీ ప్రియుడైన,

హరుడు,



# లేఖ 28.

అత్యంత ప్రియమైన తల్లీ,

(జతీంద్రనాథుని భార్యకు)

తండ్రి ఆఫీసులో ఉంచబడుట నిజముగ ఎంతో శుభ కరము. ప్రియమైన తల్లీ! నీపేరు అత్యంత కృపామయమైనది. అట్టి కృపామయుడైన కృష్ణుని యొక్క శ్రేయోదాయకము, మధురాతి మధురమైన నామమును మరువకుము. భుజించు చున్ననూ, నిద్రపోవుచున్ననూ, కూర్చున్ననూ, లేచు చున్ననూ, సర్వదా ఆ నామమును జపించు చుండుము. అమ్మా! ఒకానొక నాడు ఆనందమయమైన బాలల గృహములా ఉన్నట్టి యీ ప్రపంచమును వదలివేయవలెను. అందుచేత నేను చెప్పున దేమన భర్త గృహములో ప్రతి ఒక్కరికిని ప్రియులుగనే మెలగుచుండవలెను. భర్త గృహములో పొంద గలుగు ప్రేమ పూరిత రక్షణ, ఆనందము, సౌఖ్యము నిజముగా భర్త యొక్క ఆదరణలయందున్నవి. అందుచేత సదా మన నాథుడైన కృష్ణుని కాని, ఆతని నామమును కాని మరువ వద్దు. అమ్మా, యీ ప్రాపంచిక బాంధవ్యులైన, సంతానము, తల్లితండ్రులు, భర్తలు కొద్దికాలమే యుందురు. కాని కృష్ణుడు సర్వదా మన వాడే. అమ్మా! మీరందరూ శాంతి పురమునకు చెంది యుండుటచేత మీరు వ్రజస్త్రీలు. అందువలన మా వందనము లకు మీరు అర్హులు. మీ దయచేతనే, మీరు మధురమైన

నామమును జగత్తునకు అందజేసితిరి. అద్వైత మహాశయుని యొక్క ప్రేమ బంధనము చేతనే గౌరాంగ రూపముతో కృష్ణుడు అవతరించి నామ ప్రచారము చేసెను. అమ్మా! నేను శాంతి పురమును చూడ గలుగుదునా? నా తల్లిని తెలుసుకొన గోరు నా ఆశలు హెచ్చయినవి. ఈ దర్శనము ఆ కోర్కెను సఫలము చేయవచ్చును.

నీ ప్రేమ బిడ్డ,
హర.

## లేఖ 29.

నా అత్యంత ప్రియమైన తల్లీ,

(నిహార్ రంజన్ బాబుయొక్క భార్యకు)

నీ లేఖ చదువుట చేత, ద్విగుణీకృతోత్సాహముతో నే నీ లేఖ వ్రాయుచుంటిని. మాఘ మాసములో 15 లేక 20 రోజులు అస్సాం వెళ్ళదలచుకొని, దానికై యత్నము చేయు చున్నాను. కాని తల్లీ, నాకోరిక నిరర్థకము. అన్నియూ, యిచ్ఛామయుని శాసనముననుసరించి జరుగుచుండును. కారణ ముల కన్నింటికిని కారకుడు తానై యున్నాడు. అన్నింటికి మూలము, అతడే; మొదలు - మధ్య - అంతమూ కూడ నతడే. అతడు లేని దేదియులేదు. ఉండజాలదుకూడ. ఇది తెలుసు కొనక, ప్రాపంచిక ధనము వలెనే. యిక్కడ అక్కడ

అతని కొరకై వెతుకు చుందుము. ప్రియమైన తల్లీ, ప్రేమించు కృష్ణుడు, మనలను సదా ఆయన కౌగిలిలో నుంచుకొని మనపై ఆతని ప్రేమ, కటాక్షము లొలికించుచునే యున్నాడు. కాని గ్రుడ్డి వారి వలె మనకనులను మూసికొను చున్నాము. ఆతని సుందరవదనము నందైనా మనదృష్టిని మరల్పము. ఇతర దిక్కులందు మనదృష్టిని పోనిచ్చెదము. అందు వలనే మనకు ఎవ్వరునూ లేక వంటరిగానే ఉన్నామని తలంచెదము. ఎవ్వడైననూ అతనివైపు ఒకే ఒక్కసారి చూచి నంతనే, నేత్రము లక్కడనే బంధింపబడి, మరేదియూ చూచుట కసంభవమగును. అచ్చట నుండి కదుల దలచినను కదులలేదు. తల్లీ, అతని (ప్రభుని) నామ మెంత మధురమో, అతని రూపము కూడ అంత అద్భుతము. అందుచేతనే కాబోలు చాందీదాసు: "నే మరువ యత్నింతును, కాని మరువ జాలకుంటిని," అని పలికెను. అందుచేత గోస్వామి ప్రభువు, తన్మయుడై, విదగ్ధ మాధవములో "పెదవుల పై నృత్యముతో ఆరంభమైన నామము, చివరకు వేయినోళ్లను కోరు చున్నద"ని వ్రాసెను. తల్లి, ఎవరు ఆ సౌందర్యమును చూచెదరో వారిని వారు కోల్పోవుట, ఎవరు నామము జపింతురో వారు నామమును మరువ జాలకుండుట నిక్కమమైన సత్యము. అందు వలననే కాబోలు శ్రీమతి, "నేను మరువ దలచినను వాడు నామనసు ముందరే తాండవించు చున్నాడు" అని చెప్పినది. తల్లి, ఏ సాగరము యొక్క ఒక్క బిందువు చేతనే యీ సూర్య చంద్రాదులు, లతా వృక్షములు, ఫల పుష్పములు, పూర్ణ సుందర విశ్వము, సృష్టింపబడెనో,

ఆ నిరుపమాన సుందర సాగర మెంత అద్భుత మైనదోయని ఆశ్చర్య పడుచున్నాను. తల్లీ, ఎవ్వారైనను ఒక్కసారి ఆ సాగరమున పడినచో తిరిగి రాగలరా? బహుశా, కవి రాజ గోస్వామి, "ఆ ఒక్కబిందువు విశ్వము నంతయూ ముంచి వేయున" ని వ్రాయునపుడు, యీసౌందర్యమునే ధ్యానించు చుండి యుండవచ్చును. మరుక్షణము, బిడియము పొందినవాని వలె, "ఒక్కసారి కలసినచో, వియోగము సంభవము. వియోగము కలిగి వేరు వేరుగానుండుట అసంభవము"ని వ్రాసెను. బహుశా, ఆసౌందర్యరాసి, కళావంతమైన రాధ, యీ తత్క్షణ సౌందర్యమును చూచి, లజ్జాన్వితురాలై, "ఆహా! నీయందలి నాగర్వము వల్లనే, నేను గర్వించెదను. నీ సౌందర్యము వల్లనే నేను సుందరముగ నున్నాను. నీ రజిత పదయుగళమును సర్వదా నా హృదయముపై నుంచుకొనుటకై నామనస్సు కోరుచున్న"దని చెప్పెను. తల్లీ, అందుచేత, మన ఆత్మ ప్రియుని యొక్క సౌందర్యము, ఆతని నామమునకు సరి తూగు నని చెప్పు చున్నాను. అందు ఏ ఒక్క దానిచేతనైనను ముగ్ధురాలవైనచో, ఆనందోన్మత్తత నొందెదవు. ఇంద్రియములు కూడ నిన్ను క్రిందకు లాగలేవు. ప్రపంచము నిన్ను బంధింపజాలదు.

శుష్క తర్క వచనములు నా కానందమును కలుగ జేయలేవు; అపుడు వేదములు నా అధీనము నందుండును. నేనపుడు వేదాతీతుడను. అపుడే యీ విశ్వమును పాలించు

చట్టములను నియమించెడి కలమును ముక్కలు చేయు శక్తి పొందెదను. ఈ శక్తితో శక్తి వంతుడ నయ్యెదను.

అందు చేత తల్లీ, నీ నేత్రములను ఆ సౌందర్యము వైపు త్రిప్పుము. నీ మనస్సును, నాలుకను ఆనామము వైపు త్రిప్పి సర్వమును మరువ వలెనని చెప్పుచున్నాను. ఆసౌందర్య మును చూచినంతనే అదృష్టవతియైన ఒక స్త్రీ "నాశరీరము కంపించు చున్నది. నాకు జ్వరము వచ్చుచున్నది. నేనడుగులు వేయజాలకున్నాను. చంద్రుని వంటి సుందర గౌరాంగ సౌందర్య సాగరములో నే నీద జాలను" అని చెప్పెను! రా, తల్లీ, ఆ సౌందర్యములోనికి దుమికెదము. నీ అంత నీవే దుమికితివి. నన్ను నీచేతులలోనికి తీసుకొని ఏల యింకొకసారి దుముకవు? నేను అపుడు తృప్తి చెందెదను. నాకు దుముకుటెట్లో తెలియదు. అందుచేత నా తల్లి చేతులలో నుండి, అందులో యీదెదను. దయ యుంచి యీ తెలివి తక్కువ కుమారుని మరువవద్దు.

నీ ప్రియ,

హార.



# “ శ్రీ హరనాధ మురళి. ”

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

సంపాదకులు : శ్రీ నందిపాటి వెంకటనారాయణగారు, B. A.,

ఈ పత్రిక 19 సంవత్సరముల నుండి శ్రీ హరనాధ భగవానుని దివ్యసందేశములను, ఆంధ్ర దేశమునకు అందజేయు చున్నది. ఈ పత్రికను పొందుట ద్వారా తమ హృదయములు ఆనంద భరితములగునని మా విశ్వాసము.

ఈ పత్రిక సంవత్సర చందాల వివరము :_

| | | | |
|---|---|---|---|
| రాజపోషకులు | 10 రు. | పోషకులు | 5 రు. |
| అభిమానులు | 3 రు. | సామాన్య చందా | 2 రు. |

పత్రికలు వలయువారు :

యీ క్రింది విలాసమునకు వ్రాసి పొంద ప్రార్థన.

శ్రీ త్రిపురమల్లు నరసింహంగారు B. A., మేనేజరు,
శ్రీ హరనాధ మురళీ కార్యాలయం, నాజరుపేట,
తెనాలి. (గుంటూరుజిల్లా)

ఈ పత్రికకు భగవద్విషయములను గూర్చి వ్యాసములు పంపవచ్చును. రచనలు పంపదలచినవారు ప్రతిమాసము 25 వ తేదీ లోగా యీ దిగువ విలాసమునకు పంప ప్రార్థన.

రాళ్లబండి సత్యాలు, 2_2_1123, నల్లకుంట,
అంబరు పేట, P. O.
హైదరాబాదు _ దక్కన్.

కుసుమహరనాథప్రభుని దివ్యచరిత్ర పుస్తకములు, లేఖలు, పటములు, లాకెట్లు మొదలగునవి ఈక్రింది కేంద్రములలో దొరుకును:

(1) శ్రీ త్రిపురమల్లు నరసింహారావుగారు, B. A., మేనేజరు,
శ్రీ హరనాథ మురళి కార్యాలయం, నాజరుపేట, తెనాలి.

(2) రాళ్లబండి సత్యాలు, 2_2_1123, నల్లకుంట,
అంబరుపేట, P. O. హైద్రాబాదు-దక్కన్.

(3) B. వెంకటార్రావుగారు,
భగవాన్ అండ్ కో, పల్లిపట్టు, చిత్తూరు.

(4) T. శేషయ్యగారు,
అల్లూరు, నెల్లూరుజిల్లా.

(5) కుసుమ హరనాథ్ అండ్ కో.,
గాంధీరోడ్డు, తిరుపతి, చిత్తూరు జిల్లా.

(6) చిలకలపూడి రమణారావుగారు.,
జవారుపేట, మచిలీపట్నం, కృష్ణాజిల్లా.

గమనిక:_ పార్సెలు ద్వారా 2, 3, 4 ప్రదేశములనుండి మాత్రమే లభ్యమగును. వివరములకు 4 వ విలాసమునకు వ్రాయవలెను.

---

విక్టోరియా జూబ్లి ముద్రాక్షరశాల, చిత్తూరు-1956.